# మహిళల ఆరోగ్య రక్షణకు

## లోధ్ర

### గర్భాశయరోగ నివారిణి

స్త్రీలకు కలుగు ఋతుశూలల, బహిష్ఠ కాకుండుట, అకాలబహిష్ఠ, మైల జాస్తిగాను తక్కువగాను పోవుట, కుసుమరోగము, సంతానహీనత, రక్తహీనత, మలబద్ధము, సూతికావాతము, కీళ్లనొప్పులు, అరికాళ్లు అరచేతులు మంట మొదలగు స్త్రీ మర్మ వ్యాధులను కుదుర్చును.

12 ఔ. రు. 4-4-0 6 ఔ. రు. 2-4-0

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణీ స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తలతిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము. జ్వర వేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలెయుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1-4-0

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాలప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుమునొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయేగాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3-2-0 6 ఔ॥ రు. 5-8-0

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతుస్రావ దోషముచే గల్గు వాతవ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0-0

## సౌభాగ్య శొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమును ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగనున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారు చేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము నారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2-0-0

## ప్రమేహాంతకం

### (తెల్లబట్టవ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతియందు యీజబ్బు సర్వసాధారణముగనుండును. పసిపిల్లలకుగూడ యీవ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీవ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

బుడ్డి రు 4-0-0

## కేసరి కుటీరం లిమిటెడ్

15 వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14

తెనుగుజిల్లాలకు, నైజామునకు ఏజంట్లు

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికింద్రాబాదు




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వ్రాని విలువ మేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును: రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.



వ్యవస్థాపకులు :

డాక్టరు కే. యన్. కేసరి

# గృహలక్ష్మి

విజ్ఞాన వినోద ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుటకు ఏర్పడిన స్త్రీల
సచిత్ర మాస పత్రిక

ఆక్టింగ్ ఎడిటర్ :

సి. సి. వున్నయ్య

సంపుటము 23] ఏప్రెల్ 1954 [సంచిక 4

# విషయసూచిక




జయజయ గృహలక్ష్మీ సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతిమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



# ఉగాది రాకపోకలు

ఉగాది రాకపోకలతోటి విజయ సంవత్సరము అంతమయి జయనామ సంవత్సరము ప్రారంభమయినది.

ఉగాది నాటి వేపపువ్వు ప్రసాదపురుచి — చేదు, పులుపు, తీపులు సమైక్యము యింకా స్ఫురిస్తునేయున్నది. ప్రతియొక్కరు గడచిన సంవత్సరకాలంలోని జీవిత విశేషాలను స్మరిస్తూ ఆరంభమయిన సంవత్సరము తనకు శుభప్రదం కాగలదని ఆశిస్తూ ఆత్మ బలాన్ని పదిలంచేసికొని జీవితరంగంలోకి కాలు పెడతారు. ముఖ్యంగా తెలుగు ప్రజానీకం అభ్యంగనస్నాన, వస్త్రాభరణాలంకరణలతో పాటు భగవదారాధన, వేప పువ్వు ప్రసాదము నారగించడములకు ప్రాధాన్యమిస్తుంది. ఆనాడు జరిగే పంచాంగ శ్రవణం సంవత్సరకాల పర్యంతం వివిధరంగాలలోని ఫలితాలను తెలిసికోడానికి ఉద్దేశించినది. జరిగే అభిషేకాలు, అర్చనలు, తమకు - సర్వ ప్రజానీకానికి ఆయురారోగ్య సౌభాగ్యాల కని ఉద్దేశించబడినవి.

వేపపువ్వు, క్రొత్తచింతపండు పులుసు, మామిడికాయి ముక్కలు, చక్కెర దేనికది ప్రత్యేకరుచి కలిగినదైనా వాని కలయికచే నేర్పడిన ప్రసాదం మానవ జీవిత నైజాన్ని స్ఫురింపజేసే రుచికలదిగా నొప్పుతుంది.

మానవశ్రేయస్సు, అభ్యుదయము, శాంతి పేర్లతో రోజుకొక మారణ యంత్రము తయారయి ప్రజానీకాన్ని కని విని ఎరుగనంత భయకంపితులను చేయుచున్న యీ యుగంలో తెలుగువారికి జయనామ సంవత్సరము ఆరంభమయింది. యావత్ప్రపంచము ఎట్లున్నా తెలుగు ప్రజానీకం తమకు సిద్ధించిన నూతనరాష్ట్రాన్ని శాంతి సౌభాగ్య నిలయంగా చేసికొని తాము భోగభాగ్యాలతో పురోభివృద్ధి చెందాలంటే ఆత్మబలం చిక్కబట్టుకోవాలి. ఐకమత్యము, పరస్పర సహకారసద్భావముల నలవరచుకోవాలి. కష్టసుఖాలను కావడికుండలుగా నెంచి విశాలదృక్పథంతో రాష్ట్రాభ్యుదయానికి బాధ్యతా యుతంగా బద్ధకంకణులు కావాలి!

ప్రస్తుతపు కల్లోలిత రాజకీయ వాతావరణం సమసిపోనందువలన మంచికంటె చెడుపే అధికము. మన దేశానికి కావలసినది జాతీయవిధానం. దాని ననుసరించిన ప్రజాభ్యుదయ కార్యక్రమంపట్ల ప్రభుత్వముతోబాటు ప్రజలు సయితం అత్యంతాసక్తితో సహకరించిననాడు కాని ఫలప్రదం కాజాలదు. ప్రణాళికలు ఎంత ఉత్తమమయినవైనా ప్రజల సహకార సద్భావములున్ననే కాని ప్రభుత్వము సమర్థనీయంగా నిర్వహించజాలదు. ఇందులో సంకుచిత తత్వాలు చొరకుండాయుంటే జయనామ సంవత్సరము సాధించనున్న ఘనవిజయాలలో ఆంధ్ర దేశంలో 22 కేంద్రాలకు చెందిన 1600 గ్రామాలలో తలపెట్టిన జాతీయ విస్తరణ కార్యక్రమము ఫలప్రదం కాగలదు. అది విజయవంతమయిననాడు కళావిహీనమైన జనపదాల స్వరూపం మారిపోయి నవ చైతన్య విలసితము కాగలవు.

ప్రభుత్వ విధానాలు ప్రజాహితములు కానట్టివిగా రూపొందిననాడు దానిని తీర్చి దిద్దవలసినవారు సయితం ప్రజలే. ప్రజలు, ప్రభుత్వము ఏకోన్ముఖంగా స్వరాష్ట్ర పురోభివృద్ధికి కృషిచేసిననాడు జయనామ సంవత్సరము ఆంధ్రరాష్ట్రాన్ని సకలార్థ సాధకంగా, ఆదర్శప్రాయంగా వర్ధిల్లచేయగలదు!

# వాల్మీకి - వాలివధ

శ్రీమతి వేదుల మీనాక్షీదేవి



వాల్మీకి ఋషి "నానృషిః కురుతేకావ్యం" అనే విషయానికి ఆదికవి వాల్మీకి సర్వదాలక్ష్యమై యున్నాడు. ఋషి ప్రోక్త కావ్యాల్లో త్రికాల బాధ్యాలయిన సత్యాలిమిడి యుంటవి. ఆ నాటి సందేహాస్పదముగానున్న ఘట్టాలు నేటికీ, యెప్పటికీ సందేహముగానే యుంటవి. లోకానికి ఆదర్శముగా యుండవలసిన యొక మహాపురుషుని చిత్రిస్తూ, ఆ మహాపురుషునికి న్యూనతవలె కనబడెడి ఘట్టాల్నికూడా మహాకవి వాల్మీకి విడిచిపెట్టలేదు. సమగ్రత్వం పరమపురుషునికితప్ప యెంత ఉత్తముడైన మానవమాత్రునికి కలుగనేరదని నిరూపించాడు.

వాలివధ విషయంలో మహాకవి వాల్మీకికే సందేహము కలిగియుండాలి. చాల పెద్ద ఆర్గ్యుమెంటు చెప్పి శ్రీరాముని తప్పులేదని నిర్ధారణచేయదలచాడు.

*    *    *

శ్రీరాముడు సుగ్రీవు డలసియున్నట్లు గ్రహించి వెంటనే విల్లెక్కుపెట్టి సూటిగా వాలి వక్షస్థలమందు గాఢముగా నాటేటట్లు కాలపాశమువంటి బాణమును వేశాడు. వెంటనే వాలి మొదలు నరికిన చెట్టువలె, ఇంద్ర ధనువు భూమిపై విరిగిపడినట్లు నిలుచున్నవాడు నిలుచున్నట్లే నిలువున నేలపైపడిపోయాడు. తన తండ్రి ఇంద్రుడిచ్చిన హేమమాలికను ధరించి యుండడంవల్ల ప్రాణమాత్రావశిష్టుడై యుండగలిగాడు. ముఖాన్న తేజస్సుగాని, తెలివిగాని తగ్గలేదు. ఆ సమయంలో రామ లక్ష్మణులు వాలిని సమీపించారు.

"తంద్దృష్ట్వా రాఘవం వాలీ లక్ష్మణం
చమహాబలం,
అబ్రవీత్ప్రశ్రితం వాక్యంపరుషం
ధర్మసంహితం"

ఆ రాముని చూచి వాలి మృదువు, న్యాయము తప్పని కొంచెము కఱకైన మాటలతో యీ విధంగా అన్నాడు.

"రామా, నీవు రాజకుమారుడవనీ, చక్కనివాడవనీ, గొప్పవంశమందు పుట్టినవాడవనీ, పరాక్రమవంతుడవనీ, మంచివాడవనీ ప్రజలు చెప్పుకోగా విన్నాను. ఇన్ని సుగుణములుగల నీ కింక యేగుణము కొరతపడి ఉన్నది ?

"పరాఙ్ముఖవధం కృత్వాకోను ప్రాప్త
స్త్వయా గుణః
యదహం యుద్ధసంరబ్ధశ్శరేణోరసి
తాడితః"

నేను వేరే యుద్ధ నిమగ్నుడనై యుండగా వెనుకపాటుగా వక్షస్థలమున బాణము నాటావు. దీనివలన నీవేమి పొందగలిగావు ?

దమము, శమము, క్షమ, ధర్మం, సత్యం, పరాక్రమం, అపరాధుల శిక్షణ, నిరపరాధుల రక్షణ రాజులకు యుండవలసిన లక్షణములు. నిరపరాధుల శిక్షించుట రాజులకు లక్షణముకాదే ! సుగ్రీవుడు నా సింహద్వారమువద్దకువచ్చి పెద్దపెట్టున అరుస్తూ



**యం. రమాదేవి**

ఆంధ్ర విజ్ఞాన సమితి (మద్రాసు) వారి 'శ్రీకృష్ణ తులాభారం' నాటకంలో సత్యభామ పాత్రధారిణి. చంద్రమతి, సత్యభామలాంటి పాత్రలను కడుసమర్థంగానటించి మెప్పించగలదు.

---

నన్ను యుద్ధానికి ఆహ్వానించాడు. నేను కోప కషాయిత నేత్రుణ్ణయి బయలుదేరబోతుండగా తార నన్ను సమీపించి "కోపం తగ్గించుకోండి. తొందరపడి యుద్ధానికి వెళ్లవద్దు. ఇతడనేక పర్యాయములు మీచేత ఓడింపబడి ప్రాణభీతిచేత అక్కడా అక్కడా తలదాచుకుంటున్నవాడు. ఇప్పుడు తనకు తానై మిమ్మల్ని పోరుకి పిలుస్తున్నాడంటే యేదో వెనుక బలము ఉండియుండాలి. ఆ ధ్వనిలో విజయము తనదేననే ధీమా కనబడుతోంది. ఎల్లకాలమూ ఒక్క మోస్తరుగా వుండదు. సుగ్రీవుడు చక్కనివాడు. తెలివైనవాడు. వీరుడు. అతని భార్య రుమను మీ అంతఃపురంలో ఉంచారు. అది కూడని పని. అతనితో విరోధము తగదు.

అదీగాక అయోధ్యాధిపతి కుమారులూ, ఇక్ష్వాకు వంశస్థులూ, మహావీరులూ, తేజశ్శాలురూ అయిన రామలక్ష్మణులకూ సుగ్రీవునకూ మైత్రి కుదిరినదనీ, నాకీ ప్రాంతంలోనే ఉన్నారనీ, సుగ్రీవునికోర్కె తీర్చడానికి రఘుపుంగవుడు సిద్ధముగనున్నాడని అంగదుడు మొదలైనవారు చెప్పగా విన్నాను. శ్రీరామచంద్రునితో యుద్ధముచేసి జయించుటకల్ల. ఇప్పుడు చేయదగినపని ఒకటి ఉన్నది.

"యౌవరాజ్యేన సుగ్రీవం తూర్ణం
సాధ్వభిషేచయ
విగ్రహం మాకృథావీర భ్రాత్రా
రాజన్ బలీయసా
అహంహి తే క్షమం మన్యే తేనరామేణ
సౌహృదమ్
సుగ్రీవేణచ సంప్రీతిం వైరముత్సృజ్య
దూరతః
లాలనీయోహి తే భ్రాతాయవీయానేష
వానరః
తత్రవాసన్నిహస్థోవా సర్వథా బంధు
రేవ తే"

సుగ్రీవునికి యౌవరాజ్యాభిషేకము చేసి వాని నాదరించుడు. అది రామునికీ ఆనందదాయకమే. మీ ఇద్దరి వైరము నశించును. అతడు యెక్కడ ఉన్నప్పటికీ మీ తమ్ముడే. అతని నాదరించడం మీవిధి" అని సలహా చెప్పింది.

పిరికితనంవల్ల చెప్పలేదా సలహా. ఆమె పూర్వపరాలు పరికించి, ముందు కర్తవ్య మాలోచించి, మరదేగదా అని తేలిక చెయ్యకుండా నిష్పక్షపాతంగా చెప్పింది. నీతివేత్త అయిన ఒకరాజకీయవాదివలె చెప్పిందికాని, నాకామె సలహానచ్చలేదు. అందుచేతనే నామెతో "ముందు నేనై యుద్ధానికి వెళ్లలేదు.

వాడేపిలుస్తున్నాడు. అటువంటి సమయంలో నీవు దైవ వాడూరుకోవచ్చునా? వెళ్ళి వాడి పొగరణచి వస్తాను. ప్రాణములు తియ్యనులే. కాని, నువ్వు రాముని గురించి అనవసరంగా భయపడుతున్నావు.

"నచశక్యో విషాదస్తేరాఘవం ప్రతి
మన్యతే
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చకథంపాపం క
రిష్యతి"

ధర్మజ్ఞుడు, యుక్తాయుక్త విచక్షణ జ్ఞానముకల ఆ శ్రీరామునకు నేనేమీ అపరాధము చేయలేదు. ఆయన నన్నెందుకు బాధించును? ఉత్తమవంశమున బుట్టి, ఉత్తమ గుణములు కలిగి, ఉత్తమ పురుషుడని పించుకొనిన శ్రీరాముడు అనుచితకార్య మాచరించడని నమ్ముతున్నాను" అన్నాను. ఎంత దూరమాలోచించినా భయపడడానికి కారణము కనబడలేదు. నీకు నేనేమీ అపరాధము చేయలేదు అనే ధైర్యంతో నా తమ్మునితో యుద్ధానికి వచ్చాను.

కాని రామా! ధర్మదండమును చేతబట్టుకొని తిరుగుతున్న నీవు అధార్మికుడవని, పచ్చగడ్డిచే కప్పబడిన నూతివనీ, వేషముచే కప్పబడిన నిప్పువనీ, సాత్త్విక వేషముచే ప్రజలను వంచించువాడవని తెలుసుకోలేక పోయాను.

వానరులమైన మేమూ ఎవరికీ హానిచేసే వాళ్ళము కాము. పళ్ళు, కాయలు తిని చెట్లమీద నివసించే వారము. మా మాంసము మీకు పనికిరాదు. మా చర్మమైనా కట్టుకొనుటకు పనికిరాదు. పోనీ మా రోమములైన ఉపకరించునంటే అదీ లేదు. మరి నన్నెందుకు కొట్టినట్లు? భూమిగాని, వెండి, బంగారములుగాని ఉంటే పేచీలు వస్తాయంటారు. అవేవీ మాకు లేవే! సుక్షత్రియవంశంలో పుట్టి ధర్మ దూత నంటూ వచ్చి క్రూరకర్మ ఆచరించావు. మంచి, చెడ్డ తెలుసుకునే శక్తి, నయము, వినయము రాజులకు వలయు లక్షణములు. నీ దగ్గర నట్టి తొందరేగాని మరొక గుణము కనిపించడంలేదు. రాజును, గోవును, బ్రాహ్మణుని చంపినవాడు, చోరుడు, ఎవరి ప్రాణములనైన తీయడానికి అభిలాషపడేవాడు నరకమును బొందెదరని పెద్దలవాక్యము. ఆదశరథుని కడుపున చెడబుట్టావు. నాదు కాలము సమీపించి తార మాటలను పెడచెవిని పెట్టాను. తెలివైన భార్యమాటలు లెక్క చేయని భర్త బ్రతికి యున్నా లేనివాడితో సమానమైనట్లే. నీవంటి రాజును గల రాజ్యము రాజు లేని రాజ్యమే. నీ భార్యను పొందడానికి సుగ్రీవునితో మైత్రి చేశావు. వాని తృప్తికోసం నన్ను చంపబూనావు. నాతో చెప్పినట్లైతే ఒక్క రోజులో భూపుత్రిని నీకు సమర్పించడమే కాక ఆ రావణాసురుని నీ పాద పద్మాలపై బలి చేయక పోతినా! ఎంతపని చేశావు! చాటుగా



'శ్రీ కృష్ణ తులాభారం'లో నొక సన్నివేశము. పాత్రధారులు యం. రమాదేవి, కుమారి సావిత్రి, కొత్తపల్లి శ్రీరామమూర్తిగారలు.

కొట్టకపోతే నాతో యుద్ధానికి రాలేకపోయావా?" అని నోరెండిపోయి ఊరుకున్నాడు వాలి.

* * *

నిర్భయంగా అడగవలసిన నాలుగు అడిగాడు. రాముడు తననెందుకు కొట్టిందీ తెలియలేదు.

"పరాఙ్ముఖ వధం కృత్వా"

అని వాలి చెప్పడంవల్ల రాముడు చాటుగా వాలి వెనుదిరిగియున్నప్పుడు కొట్టాడని తెలుస్తోంది. రామాయణంలో రామునకిది కళంకం ఆపాదించినట్లుతోచి మురారి రామునికీ, వాలికీ ప్రత్యక్షయుద్ధం జరిపించాడు తన "అనర్ఘరాఘవం"లో, కాని వాల్మీకి కా పద్ధతిస్ఫురింపకపోదు. రాముని వాల్మీకి భగవంతునిగా యెక్కడా పేర్కొనలేదు. కేవలం ఒక ఉత్తమ పురుషునిగా, ఉత్తమనాయకునిగా మాత్రమే చూపాడు. మానవుడెంత ఉత్తమ పురుషుడైనా వాని చర్యలన్నీ నిర్దుష్టంగా ఉండవనీ, ఏవోలోపాలుంటాయని నిరూపించడానికే చాటునుండి వాలిని కొట్టించాడు రామునిచేత. అదే సమంజసంగాతోచింది వాల్మీకికి!

వాలి కిష్కింధా పురికి రాజు. ధర్మముగా ప్రజలను పాలించువాడు. దైవభక్తుడు. దుర్మార్గుడు, అహంభావపూరితుడు అయిన రావణాసురుని తన చేతుల క్రింద యిముడ్చుకొని సప్తసముద్రాలలో గ్రుంకిన మహావీరుడు వాలి. దుందుభి తనంతతానై వాలిమీదికి యుద్ధానికి వెళ్లాడు. కాని వాలితప్పులేదు. వాలికెవ్వరితోను వైరములేదు. ఉన్న వైరము తమ్ముడైన సుగ్రీవునితోమాత్రమే. ఆవైరమే రామునికి కోపము కల్గించిందేమోననడానికి, అతని సంబంధ మేమీలేదు. ఆవైరము సర్వసాధారణముగా భాగస్వాములైన అన్నదమ్ములమధ్య నుండే విషయమే - గృహకల్లోలము. రాజ్యాన్నిగురించే కదా శ్రీరాముడు అరణ్యాలకు బయలుదేరింది! ఉత్తముడైనవాడు ఒకపక్షమునే వినక రెండవ పక్షమును కూడవిని తరువాత తగు చర్యతీసుకొనుననివాలికి దృఢమైన నమ్మకం. అందుచేత నిర్భయంగా యుద్ధానికి వెళ్లాడు తమ్మునిచేత ఆహూతుడై.

శ్రీరాముడు దైవాంశ సంభూతుడైనా, ఉత్తమ పురుషుడైనా సామాన్యమానవులుకూడా చేయని పని చేశాడు. ఘోరమైన పాపానికీ, శాశ్వతమైన నిందకూ పాల్పడ్డాడు. ఒకరిని వెనుకవేసుకొని వచ్చుటకై మరొకరితో వైరంపూనాడు.

వాలి నెన్నడు చూడలేదు. స్వభావము తెలియదు. అట్టి పరిస్థితిలో ఆకస్మికంగా చంపబూనడం అన్యాయం. "వాలినిచంపి సుగ్రీవుని కిష్కింధకు రాజును చేస్తా"నని వాగ్దానం చెయ్యడం అనే పెద్ద పొరపాటువల్ల యిదంతా జరిగింది. ఇది పాపకార్యమనక తప్పదు. త్వరపడి వాగ్దానములు చెయ్యడం క్షత్రియ ధర్మంకాదు. అన్నదమ్ములను పిలిపించి తాను రాజీమార్గమేదైన సూచించి యెవ్వరికీ హానికానిపద్ధతిలో కార్యసాధన చేయవలసింది. ఇది రాముడంతటివాడు నెరవేర్చలేనిపని కాదు.

శాంతి సుహృద్భావాలతో యెంతటి క్లిష్టవిషయాలనైన పరిష్కరింపచూడాలి. భారత యుద్ధానికి ముందు శ్రీకృష్ణుడు కౌరవులతో స్వయముగా రాయబారియై అనేక విధముల యుద్ధము మానుమని నచ్చచెప్పాడు. కాని లాభములేకపోయింది. యుద్ధం అనివార్యమైంది.

ఇక్కడ అల్లా జరుగలేదు. వాలిని పిలువలేదు. ఈ సంగతే వాలికి తెలియదు. వాలిని పిలిపించి సంగతి తెలియజేసినచో అతడేమి చెప్పుకొనునో, పరిణామమేమగునో. పాపభీతిచేత న్యాయాధిపతులు నేరస్థునికి శిక్ష విధించేటప్పుడు వారి నేరమును వినిపించడం జరుగుతుంది. రామునకా పాపభీతికూడా లేకపోయింది. సామ, దాన, భేద దండోపాయములలో రాముడు కేవలం దండనీతినే ప్రయోగించాడు.

వాలి రాముని అడిగిన ప్రతి ఒక్క మాటా చాలా సబబుగా వుండడమేకాక వాలివధ విషయములో రాముడు అన్యాయంగా ప్రవర్తించినాడని అందరికీ తోచకమానదు.

*　　*　　*

వాలి మాటలన్నీ రాముడు శాంతంగా విన్నాడు. ఈ విధంగా వాలినన్నాడు "నీవు నన్నవసరముగా అనరానిమాటలాడావు. నీ జాతికి తగినట్లు మాట్లాడావు. మర్యాదగా మాట్లాడుట పెద్దలవల్ల నేర్చుకోలేదు.

"ఇక్ష్వాకూణామియం భూమిస్సశైల
వనకాననా,
మృగపక్షి మనుష్యాణాం నిగ్రహ
ప్రగ్రహావపి"

పర్వతాలతో, అడవులతో, వనములతోసహా యీ భూమి అంతా ఇక్ష్వాకు వంశస్థులకు చెందినది. మృగాలుగాని, పక్షులుగాని, మనుష్యులుగాని ఇక్ష్వాకు వంశస్థుల నిగ్రహానుగ్రహాలకులోబడి ఉండవలసినదే. ఇప్పుడు భరతుడురాజు. ఈ ప్రదేశమంతా అతనికి చెందిందే. అధర్మము చెలరేగినచో ధర్మమును స్థాపించమని భరతుని ఆజ్ఞ. ఆ ఆజ్ఞ ప్రకారం మేము తిరుగుతున్నాం.

నీయందు తప్పులేనిదే నిన్ను కొట్టలేదు. అన్న, గురువు తండ్రితో సమానులు. శిష్యుడు, సోదరుడు కుమారునితో సమానులు అని ప్రాజ్ఞులు చెప్పెదరు. పెద్దలు పిన్నల నాదరించడము ధర్మం. నేను నా తమ్మునికై రాజ్యత్యాగముచేసి, తాపసినై అడవులలో తిరుగుతున్నాను. నీవో నీ తమ్ముని దూరముగా తరిమివేసి హాయిగా నీ మందిరములో కూర్చున్నావు. రాజ్యభోగాలనుభవిస్తున్నావు. ఇది ఒక అపరాధము.

తమ్ముని భార్య, కోడలు కుమార్తెతో సమానులు. అలాంటి సందర్భంలో నీ తమ్ముని భార్య "రుమను" నీ అంతఃపురంలో ఉంచావు. భార్య వియోగముతో, నిలువ నీడలేక నీ తమ్ముడెట్టి అవస్థలు పొందుతున్నాడో ఆలోచించావా ఎన్నడైనా? ఇది మహాపరాధము, రెండవ అపరాధము. భరింపరాని తప్పిదము. ఇట్టి పాపిని శిక్షించి ధర్మ సంస్థాపన చేయక ఉపేక్షించడం అధర్మానికి తావివ్వడమే.

పరిగెత్తుచున్నా, నిలుచున్నా, భీతిజెందియున్నా నరులు వలలొగ్గి, మోసంచేసి, పొంచుండి జంతువులను పట్టుకొనడంకలదుకదా. అందువలన నిన్నీ విధంగా పట్టుకొనుట నాకు మనస్తాపంగాని, పాప భీతిగాని లేదు.

రాజులనగా మనుష్యరూపంలోవున్న దేవతలు. దండింపబడవలసినవాడు దండింపబడుట, దండింపవలసినవాడు దండించుట చేయదగినపనులే. ఆ యిద్దరూ వారి వారి ధర్మము లాచరించినవారౌతారు. దండింపబడవలసినవాడు ఇహలోకంలోనే దండింపబడినచో పరలోకంలోనరకబాధ వుండదు, ఆముష్మిక సుఖములు పొందవచ్చు." ఇదీ రాముని సమాధానము.

తన విధిని నిర్వర్తించానన్నాడు. ఇక్కడ వాలిని శాఖామృగమనుకొన్నట్లైతే మృగయాక్రీడ రాజులకు విహితమైనదే కనుక కొట్టాడు. అలాకాక వాలిని కిష్కింధాపురికి రాజు అనుకుంటే అతనిని మనిషివలె దండించాలి. మరదలి నపహరించినందువల్ల, తనకై తన తమ్ముని అడవులపాలు చేసినందువల్ల కొట్టాడు. ఏ విధంగాచూచినా వాలిని కొట్టడం న్యాయమనీ, అది తన విధి అనీ, తన తప్పు యీషణ్మాత్రంకూడా లేదనీ శ్రీరాముని సమాధానంవల్ల తెలుస్తోంది.

శ్రీరాముని సమాధానము వాలి ప్రశ్నలకు సరియైనదికాదనే చెప్పాలి. ఇంకా వాదిస్తే తన భార్య తారను, ముద్దుల కుమారుడు అంగదుని హింసిస్తాడేమోననే జంకుచేత ఊరుకున్నాడుగాని వాలికీ సమాధానము నచ్చికాదు.

తమ్ముని భార్యను అంతఃపురంలో వుంచాడనే వాలిని చంపాడు రాముడు అనుకుంటే వాలి మరణానంతరం సుగ్రీవుడు అన్నభార్యను స్వీకరించలేదా! వదినగారు తల్లితో సమానముకాదా! అప్పుడు శ్రీరాముడేమీచేయక హర్షించి ఊరుకోలేదా! ఆ నీతులేమయాయి!

ఈ సందేహమే తరువాత పురాణ కర్తలకు కలిగింది. అప్పుడు తార అయోనిజ అనియు, వారి విషయములో దోసా దోషములు పరిగణింపపనిలేద నియు శివోక్తిగా చెప్పబడింది.

ఇక తమ్ముని పడలగొట్టాడంటే దేవతలకు, రాక్షసులకు నిత్యం వైరమే స్వర్గమునుగురించి. దేవతలే యెప్పుడూ అధికారం చెయ్యడమేమని రాక్షసుల వాదం. శ్రీ మహా విష్ణువు దేవుడు కనుక దేవతల పక్షం వహించి రాక్షసుల నణగద్రొక్కుతూండే వాడు. కాని, యిక్కడ రాముడు దేవుడు కాడే! మానవుడు; అందులోనూ ఉత్తమ పురుషుడుగా పేర్కొన బడ్డాడు. అన్నదమ్ముల విద్వేషంలో యేపక్షం తాను ఉండనక్కర్లేదే! అనవసరంగా జోక్యం కలిగించుకున్నాడు. తను తమ్మునికోసం రాజ్యంవిడిచి అడవులకువస్తే వాలి తన తమ్ముని అడవులకు తరిమివేశాడని రాముని సమాధానం. రాముడు తండ్రి ఆజ్ఞ ప్రకారం చేశాడుకాని రాజ్యకాంక్షలేక నేనా? : "నీవు యెవరికో యేదోవరము లిస్తాంటే నేను అడవికి ఎందుకు వెళ్ళాలి? నేను వెళ్లను" అంటే దశరథుడు యేమిచెయ్యగలడు? వంశానికి కళంకంరాకుండా పితృవాక్యపరిపాలనచేశాడు. అదే రాముని గొప్పతనం.

కాని అంత మాత్రంచేత అది తన తమ్మునిపైగల మమకారమనీ తండ్రి మాటపైకాక తమ్మునికోసమే రాజ్య త్యాగంచేసి తాపసిగా వనవాసంచేశాడని రాముడు తలంచడం భావ్యంగా లేదు.

* * * *

సమగ్రత్వం పరమపురుషునికి తప్ప ఎంత ఉత్తముడైనా మానవ మాత్రునికి కలుగనేరదని నిరూపించడానికే అక్కడక్కడ రాముని న్యూనత నాపాదించే ఘట్టాల్ని చిత్రించాడు వాల్మీకి.

తన రచనలో రాముని లోపాలుగా కనుబడుతాయేమోనని సందేహంకలిగిన ఘట్టాల్లో రాముని సమర్థిస్తూ, ఆ లోపం కనబడకుండా చేయజూచాడు వాల్మీకి. కాని వాల్మీకికి సందేహాస్పదంగావున్న ఘట్టాలు నాటికీ, నేటికీ, యెప్పటికీ సందేహంగానే ఉండిపోయాయి.



నృత్యకళానిధి గోపీనాథ్, గోపాలకృష్ణన్‌ల
గీతోపదేశ భంగిమము



# మధూలిక

మాతృక : శ్రీ జయశంకరప్రసాద్

అనుసరణ : హృదయిని



[మధూలిక తన భూమిని కోసల దేశాధీసునికి కోల్పోయి చింతాక్రాంతురాలై ఏకాకి జీవితము గడుపుచుండగా మగధదేశపు రాకుమారుడు ఆమె రూపలావణ్యమును చూచి ముగ్ధుడై ఆమె ప్రేమానురాగములకు పాత్రుడు కాగోరి మొదటిసారి విఫలుడయ్యెను. మరొకసారి కటికచీకట్లో, కుంభవర్షంలో మధూలిక ఆశ్రమ ప్రాంగణమున అరుణుడు ప్రత్యక్షమయ్యాడు. రాకుమారుని మాటలు ఆమెకు ఆత్మ విశ్వాసాన్ని పెంపొందించినవి; ఉత్తేజపరచినవి. దాంతోటి వారిద్దరి ప్రేమానురాగాలు పవిత్రంగాను, అవ్యాజంగా ఫూపొందినవి. అరుణుని బాహుబలం, శక్తిసామర్థ్యాలతో నిర్మితం కానున్న మహత్తరమైన భవిష్యత్తును ఊహిస్తూ అరుణుని సమక్షంలో మంత్రముగ్ధమయింది — యికచదువండి]

స్వర్గతల్పముపై స్వప్నాంకితుఁడై యర్ధనిద్రావస్థలో ముకుళిత నేత్రములతోఁ గోసల నరేంద్రుఁడుండెను. వెనుకభాగమున నొక చామరధారిణి నిలువఁబడి తన హస్త సంచాలన కౌశలమును జూపుచుండెను. చామరముయొక్క శుభ్ర సంచార మా ప్రకోష్ఠమందు మందమందముగ నుండెను. కరండవాహిని ప్రతిమవోలె దవ్వున నిలువఁ బడియుండెను.

ప్రతిహారి ప్రవేశించి పల్కెను–'జయము మహారాజా! ఒక స్త్రీ యేదో ప్రార్థించుటకు వచ్చి యున్నది.'

'స్త్రీయా!' కన్నుల విప్పుచు మహారాజిట్లనియె–''ప్రార్థించుటకు వచ్చినదా? రానిమ్ము.'' ప్రతిహారితో మధూలిక లోనఁ బ్రవేశించి ప్రణామ మొనరించెను. మహారాజు స్థిరదృష్టితో నామెవైపు చూచియిట్లనెను–''నిన్నెక్కడనో చూచినట్లున్నది.''

''మూఁడేండ్లయినది ప్రభూ! నా పొలము సేద్యమునకై గైకొనఁబడినది.''

''ఓహో! అయినచో నీవిన్నిదినములు సంకటమునందుఁ గడిపితేమొ! ఏమి? నేఁడు దాని మూల్య మర్థించుటకు వచ్చితివి కాబోలు మంచిది, మంచిది, నీకు లభించుగాక, ప్రతిహారీ!''

''వలదు మహారాజా, నాకు మూల్యము వలదు!''

''అవివేకినీ! అయిన నీకేమిగావలె?''

''అంతే భూమి - దుర్గదక్షిణద్వార సమీప కానన భూమి. అక్కడనే సేద్యము జేసికొనెదను. నాకొక సహాయ

కారుఁడు లభించినాఁడు. అతఁడు తన సేవకులతో నాకు సాయము చేయును. ఆ భూమిని సమతలము చేయవలసి యుండును.''

''కృషిక బాలికా! అయ్యది మిట్టపల్లపు నేల. ఇట్టి స్థితిలో నచ్చట సైనికశిబిరముంచఁబడుచున్నది.''

''అయినచో నిరాశతో మఱలిపోవుదును.''

''సింహమిత్రకుమారీ! నేనేమి చేయుదును? నీ యీ ప్రార్థన ......!''

''ప్రభూ! మీయాజ్ఞ యెట్లైతే...''

''సౌమ్యా. నీ సేవకులనచ్చటికిఁ దెచ్చికొనుము. నేనమాత్యున కాజ్ఞాపత్రము పంపుట కాదేశమిచ్చెదను.''

''జయము దేవా!'' ప్రణామ మొనరించి మధూలిక రాజప్రాసాద బహిర ప్రదేశమునకు వచ్చెను.

♦ ♦ ♦

దుర్గ దక్షిణభాగమున భయంకర నదీతట సాంద్రారణ్యముండెను. నేఁడచ్చటి నిర్జనత్వము జనసంచారముచే భంగమాయెను. అరుణుని గూఢ సేవకులు స్వాతంత్ర్యకాముకులై అటునిటు తిరుగాడుచుండిరి. పొదలను నఱికివేయుచు మార్గమును దయారుచేయుచుండిరి. నగరము దూరము; అందుచే నటువైపు వ్యర్థముగా నెవరును రారు. ఇప్పుడచ్చోటు మహారాజు నానతిచే మధూలిక పొలము కాఁబోవుచుండెను ... ఎవరికి దీని యాలోచన కావలెను?

ఒక విశాల శిలాఫలకముపై మధూలికాయరుణులు పరస్పరము హర్షదృక్కుల జూచుకొనుచుండిరి. ఆ నిబిడారణ్యమందు సాంధ్యతిమిరము స్వేచ్ఛగాఁ బ్రవేశించుచుండెను. ఆ నవీన యాగంతులనుగాంచి పక్షిగణములు తమ నెలవులకు మఱలి వచ్చుచు నధికమైన కోలాహలము గావించుచుండెను.

ప్రమోదముతో నరుణుని నేత్రములు ప్రకాశించెను. సూర్యుని యాతిమకిరణములు లాతాలాస్యములఁ ద్రోసికొని మధూలికా కపోలములతో నాటలాడుకొనసాగెను. ''నాల్గుపూట లింకదాలుము. ప్రభాతమందే జీర్ణకళేబరమగుకోసలరాష్ట్ర రాజధాని, శ్రావస్తియందు నీకభిషేకమగును. ఇఁక - నేనో - మగధచే దేశభ్రష్టుడనైన నేను - ఒక స్వతంత్రరాజ్యాధిపతి నయ్యెదను, మధూలికా!''

''భయంకరము! అరుణుఁడా, నీ సాహసమును జూడ నా కాశ్చర్యమగుచున్నది. కేవలము వందమంది భటులతో నీవు .''

''మధూలికా రాత్రి మూఁడవజామున నా విజయయాత్రయగును!''

“అయనచో నీకు నీ విజయముపై విశ్వాసమున్నదా ?”

“అవశ్యము. నీవీరాత్రి నీ కుటీరములో నిద్రించుము. ప్రభాతమునుండి రాజమందిరమే నీలీలానికేతన మగును.”

మధూలిక ప్రసన్నయైయుండెను. కాని, అరుణునికొరకు–అతని కళ్యాణ ప్రయత్నముపై నామెకు శంకగానుండెను. అప్పుడప్పుడామె యుద్విగ్నయై బాలకునివలె ప్రశ్నించుచుండెను. అరుణుఁడామెకు సమాధానమిచ్చుచుండెను. అకస్మాత్తుగా నతఁడేదో సంజ్ఞప్తుఁడై యిట్లనెను ‘మంచిది మధూలికా! పొద్దుపోవుచున్నది. నీకుఁ జాలదూరము పోవలసియున్నది. అటు నాకుఁగూడ ప్రాణములనొడ్డి యీ విప్లవ ప్రారంభకార్యముల నర్ధరాత్రిలోపలనే పూర్తిచేయవలసియున్నది. కాన, యీ రాత్రికింక సెలవు!’

మధూలిక లేచి నిలువఁబడెను. కంటకభూయిష్టమగు పొదలను దప్పించుకొనుచు క్షణక్షణ మధికమగుచున్న యంధకారమందామె తన కుటీరమువైపునకు మఱలినది.



మార్గమంధకారమయము, మధూలికా హృదయముకూడ నిబిడతమనస్సుచే నావరింపఁబడియుండెను. ఆమె మానసము హఠాత్తుగాఁ జవించెను. మాధుర్య మదృశ్యమాయెను. కల్పనా జగత్తులో నెట్లు సుఖించినదో, అట్లే యంధకారమందు విలీనము కాజొచ్చెను. ఆమె భయకంపిత మాయెను. తొలిగా నరుణునికై యామెకు భయము జనించెను .. అతఁడొక లేశ విజయుఁడు కాకపోయినచో ? వెను వెంటనే యామె యిట్లూహింప సాగెను–అతఁడెందుకు విజయుఁడు కావలెను ? శ్రావస్తీ దుర్గము పరదేశీయుని యధికారమందేలఁ బడవలెను? శ్రావస్తీ దుర్గము పరదేశీయుని యధికారమందేలఁ బడవలెను? మగధ కోసలదేశ చిరశత్రువు! ఒహో! దానిని జయించిన కోసల నరేంద్రుఁడేమనియెను– “సింహమిత్రుని కన్యయా!” సింహమిత్రుఁడు కోసలను రక్షించిన శూరుఁడు, అతని కన్యనేఁడేమి చేయఁబోవుచున్నది? వలదు, వలదు. మధూలికా! మధూలికా!! అని యామెజనకుఁడాయంధకార మందుఁ బిలుచుచున్నట్లుండెను. ఆమె పిచ్చిదాని వోలె కెవ్వున కేకవైచెను. దారితప్పెను.

ఒక జాము ప్రొద్దు పోయినది. కాని మధూలిక తన కుటీరమును జేరలేదు. ఆమె ఆలోచనా పరంపరలతో నున్మత్తురాలివోలె నడుచుచుండెను. ఆమె నేత్రములకెదుట సింహమిత్రుఁడొకసారి, అరుణుఁడొకసారి, ఆ చిమ్మచీకటిలోఁగాన వచ్చుచుండెను. మెఱపు మెఱిసినది, మార్గమధ్యమందే యామె నిలువఁబడిపోయెను.

ఇంచుమించు, ఒకవందమంది కృపాణ ధారులయిన అశ్వారోహులు లరుదెంచు చుండిరి. వారికి ముందుగానొక ప్రౌఢవీర సైనికుఁడుండెను. అతని యెడమచేతియందు గుఱ్ఱపుకళ్లెము. కుడిచేతిలో నగ్నఖడ్గము నుండెను. అత్యంత ధైర్యముతో నా సైన్యము పథగామియగుచుండెను. కాని మధూలిక మార్గమధ్యమునుండి చలింప లేదు. సైనిక ప్రముఖుఁడామె చెంతకు వచ్చెను. ఆమె అప్పటికిని తొలఁగలేదు. సైనికుఁడు తురంగమునాపి - ఎవరునీవు, యని యడిగెను. ప్రత్యుత్తర మేమియు రాలేదు. అప్పుడు ద్వితీయసైనికుఁడు కఠిన స్వరముతో, "నీవెవరవు యువతీ? కోసల సేనాధిపతికి శీఘ్రముగా నుత్తర మిమ్ము!"

మధూలిక విషాదగ్రస్తస్వరమున నిట్ల రచెను — "బంధించుఁడు నన్ను, బంధించుఁడు! నన్ను వధించండి నేనపరాధమె చేసితిని.."

సేనాపతికి నవ్వువచ్చెను - "పిచ్చిది!"

"పిచ్చిదాననా! కాదు. అటులగుచో యింత విచారము, ఆవేదనమేల? నన్ను బంధించి రాజునొద్దకు తీసికొని వెళ్లండి."

"ఏమి? స్పష్టముగా జెప్పుము!"

"శ్రావస్తీదుర్గ మొక్కప్రహరములో అన్యులహస్తగతమవనున్నది. దుర్గదక్షిణ దిక్కున నాక్రమణము జరుగుచున్నది."

సేనాపతి త్రుళ్లిపడెను. అతఁ డాశ్చర్యముతో నడిగెను–"నీవేమి చెప్పుచుంటివి?"

"నేను సత్యమునే చెప్పుచుంటిని; తొందరపడుడు!"

సేనాపతి యెనుబదిమంది సైనికులను నదీతీరముపైపునకు మెల్లగా, జేరునట్లు ఆజ్ఞాపించెను. తాను, యిరువదిమంది భటులతో దుర్గమువైపు నడచెను. మధూలిక యొక యశ్వముపై బంధింపఁబడెను.



శ్రావస్తీదుర్గము కోసలరాష్ట్రకేంద్రము, యీ రాత్రి తన విగతవైభవమును స్వప్నమందు గాంచుచుండెను. విభిన్నరాజవంశీయు లారాజ్యముపై నధికారమును బొందియుండిరి. ఇప్పుడది బహుగ్రామముల కధిపతియై యుండెను. కోసల రాష్ట్ర పూర్వ స్వర్ణగాథలు దానిని జుట్టుకొని యున్నవి. అది ప్రజల గర్వకారణము. దుర్గరక్షకుఁడుల్కిపడెను ... అశ్వారోహకులు కొందఱు కడువేగమున వచ్చుచు దుర్గద్వారపు చెంగట నాగుటచే వారు ల్కాలోకనమున సేనాపతినిగాంచి ద్వారమును దెఱచిరి. సేనాపతి గుఱ్ఱమునుదిగి, 'అగ్నిసేనా దుర్గమందెంతసైన్యమున్నది?'

"సేనాపతికి జయమగుగాక! రెండు వందలమంది."

"వారిని శీఘ్రముగ నొక చోటకుం జేర్చుము నిశ్శబ్దముగ. ఒకవందమందినిఁ దీసికొని నీవు త్వరితగతిని, నిశ్శబ్దముగ దుర్గ దక్షిణ ప్రాంతమువైపు నడువుము. సద్దు సవ్వడి గానివ్వకుము!"

సేనాధిపతి మధూలికవైపు జూచెను. నిర్బంధితయగు నామెను దన ననుగమించుటకు సంజ్ఞ చేసి రాజమహాలువైపు నడచెను. ప్రతిహారి సేనాధిపతినిఁ జూచి వెంటనే మహారాజునకుఁ దెలియఁబఱిచెను. మహారాజు నిద్రించుటకు సిద్ధముగా నుండెను. కాని సేనాపతిని, వెంటనున్న మధూలికను గాంచినంతనే విస్మయాన్వితుఁడయ్యెను.

సేనాపతి:-"ప్రభువునకు జయము! ఈ స్త్రీ కారణమున నాకిచటకు హాజరు కావలిసి వచ్చినది."

మహారాజు సుస్థిర నేత్రములతోఁ దిలకించి యిట్లనెను. "సింహమిత్రుని కన్యా! మఱలయిట దేనికి? ఏమి, నీ పొలమింకను సిద్ధము చేయఁబడలేదా? ఏమైనా నిరోధమా! సేనాపతీ! నేనీమెకు దుర్గ దక్షిణ భాగమందలి భూమిని యనుగ్రహించితిని. ఏమీ, దీనిని గూర్చియేనా నీవు చెప్పఁదలచుచుంటివి?"

"ప్రభూ! ఎవడో గుప్తశత్రు వాదిక్కున యీరాత్రియే దుర్గస్వాధీనమునకేర్పాట్లు చేసెను! ఈ విషయము నీమెయె నాకు మార్గమధ్యమున నందించినది."

రాజు మధూలికవైపు చూచెను. ఆమె వణకుచుండెను - లజ్జాఘృణములచే నామె మూర్ఛచుండెను.

రాజు ప్రశ్నించెను - "మధూలికా యిది సత్యమా?"

"అవును దేవా!"

"సైనికుల నాయత్తము చేసికొని నీవు నడువుము. నేనిపుడే వచ్చుచున్నాను." అని రాజు సేనాపతివైపుచూచి పల్కెను.

సేనాపతి నిష్క్రమించెను. "సింహమిత్రసుతా! నీవు మఱల నొకసారి కోసలకు మేలు చేసితివి మంచిది. నీవిక్కడనే యుండుము. ముందాదుష్టుల శిక్షించుటకుఁ బ్రయత్నము జేసెదను.



తన సాహసిక విప్లవమునం దరుణుఁడు బంధితుఁడయ్యెను! దుర్గాముల్కాలోకనమున సత్యంత రంజితమయ్యెను. జనత జయఘోషచేసెను. అందఱి మనస్సులందుల్లాసము సల్లాపము చేయుచుండెను. శ్రావస్త దుర్గము నేడొక అన్యుని హస్తములనుండి రక్షింపఁబడెను. ఆ బాలవృద్ధనారీమణు లానందముతో నున్మత్తులయిరి.

ఉల్కాలోకనములో సభామండపము సభ్యులతో సంపూర్ణమయ్యెను. బంధితుండైన యరుణుని గాంచి సభికులు రోషముతో హుంకరించిరి - వధించుఁడు! మహారాజందఱిని సాదరముతోఁజూచి, "ప్రాణదండనము" అని పల్కెను. మధూలిక పిలుపింపఁబడెను. ఆమె పిచ్చిదానివోలె వచ్చి నిలువఁబడెను. కోసలాధీశుఁడడిగెను. "మధూలికా నీకేమి బహుమానము కావలెనో కోరుకొనుము"

ఆమె మౌనము దాల్చియుండెను...

రాజు తిరిగిట్లనెను. "నా స్వీయమైన భూమి యెంతగలదో దానినంతను నీకిచ్చుచున్నాను."

మధూలిక ఒకసారి బంధితుఁడైన యరుణునివైపు చూచెను - "నాకేమియు వలదు." అరుణుఁడు మందహాసము చేసెను!

రాజనెను. "కాదు, నేను నీకవశ్యమిచ్చెదను, కోరుకొనుము."

"అట్లయినచో నాకుఁగూడ ప్రాణదండనము విధించుఁడు!" అని పల్కుచు నామె బంధితుఁడైన యరుణుని సమీపించి అతనిప్రక్కన నిలువఁబడెను!

# తీర్పు

శ్రీ తిరుమల వెంకటేశ్వర్లు



జడ్జి రామనాథానికి ఈ కేసు వినగానే మూర్ఛవచ్చినంత పనయింది. తన పాతికేండ్ల సర్వీసులో ఇటువంటి కేసును చూడలేదు. ఎదురు గుండా చెట్టంత మనిషి నిలబడి నా భార్యను నేనే చంపేనంటే ఎలా నమ్మడం?

కోర్టంతా కిటకిటలాడుతున్నది. తుదకు ప్లీడరు ముద్దాయినిచూసి.

"నీ పేరు?"

"పుల్లయ్యండి"

"కులం?"

"కాపు"

"నిజంగా నీ భార్యను హత్య చేశావా?"

"ఎన్ని సార్లండి ఈ ప్రశ్న? నేనే నాయీ చేతులతోనే చంపాను"

"దానికి కారణం?"

"ఆ గొడవంతా మీ కనవసరం. నేనే నా భార్యను చంపాను. త్వరగా ఏ ఉరిశిక్షో ఏదో ఒకటి విధించండి."

"అదేమిటోయ్? హత్యకు కారణం?"

"ఏదో ఒకటి చంపినది నేను. సాక్ష్యం ఇరుగు పొరుగువారు."

ముద్దాయి ప్రాణంమీద ఆశలేనట్లు మాట్లాడు తున్నాడు. ప్లీడరు జడ్జివైపుతిరిగి "ముద్దాయి ఎంత అడిగినా కారణం చెప్ప డంలేదండి . . హత్యచేసినట్లు మాత్రం ఒప్పుకుంటున్నాడు."

జడ్జి రామనాథం బుర్ర ఆలోచనలతో నిండిపోయింది. ఒక వేళ ముద్దాయి హత్యచేయ లేదేమో? చేసినట్లు నటిస్తు న్నాడేమో? లేకుంటే హత్య చేసినవాడు కోర్టుకువచ్చి హత్య చేశానని ఒప్పుకుంటాడా? కాని



ముద్దాయి హత్యచేయకుంటే ఒక నిరపరాధిని దండించి నట్లవుతుంది.

జడ్జికి ఏమీతోచలేదు. ఈ హత్యమీద ఇంకా కొన్ని విషయములు రాబట్టాలనుకున్నాడు. తరువాతకాని తీర్పు చెప్పుటకు వీలులేదు. ఎలాగైనా ఈ కేసులోని కిటుకును తెలిసికోవాలనుకున్నాడు.

కేసు వారం రోజులకు వాయిదాపడింది.

♦ ♦ ♦

మర్నాడు ప్రొద్దున పుల్లడి భార్యకు అంత్యక్రియలు జరిగినవి. పుల్లయ్య భార్య చితికి స్వయంగా నిప్పుబెట్టినప్పుడుకూడ అతని ముఖంలో విచారంలేదు కాని నిరాశ కనబడింది.

జడ్జి రామనాథం పుల్లయ్య ఇరుగుపొరుగువారిని పిలిపించి అడుగగా, హత్యకు కారణం తెలియదనియు, కాని చంపినది పుల్లయ్యేనని చెప్పి వెళ్ళిపోయారు. కాని పుల్లయ్య ప్రక్కింటి రమణయ్య మాత్రం "పుల్లయ్య భార్య లీల చాల అందమైనదండి. ఒక వేళ శీలాన్ని అనుమానించి చంపేదమో ?" అన్నాడు.

జడ్జికి కొంచెం ఆసరా దొరికినట్లయింది.

"ఆ సంగతి నీ కెలాగ తెలుసు ?"

"నేను ఆ మాదిరి ఊహించానండి. ఎందుకంటే ప్రతిరోజూ పుల్లయ్య పొలం వెళ్ళిపోయిన తరువాత మా వీధిలోని శేఖరం పుల్లయ్యింటికి వెళ్తూండే వాడండి. అందువలన పుల్లయ్య అనుమానించేడేమో ?"

"దీనిపై ఇంకేమైనా తెలుసా ?"

"ఇంకేమీ తెలియవండి"

రమణయ్య శలవు తీసుకొని వెళ్ళిపోయాడు. ఈ కేసుపై పూర్తి విషయములు పుల్లయ్యనుండే తెలుసుకోవాలనుకొన్నాడు. ఒకవేళ పుల్లయ్య చెప్పకుంటే ? ఏకాంతంగా బ్రతిమలాడితే ? ఒకవేళ భార్య శీలాన్ని అనుమానించినా శేఖరాన్ని ఊరికే వదలిపెడతాడా !

అన్ని విషయాలూ పుల్లయ్యనడిగి తెలుసుకోవాలనుకున్నాడు.

మరునాడు పుల్లయ్య రామనాథాన్ని ప్రయివేటు రూములో కలసికున్నాడు. మెల్లిగా "ఎందుకు బాబు పిలిపించారు ?"

"నీతో కొంచెం మాట్లాడాలి అలా కూర్చో"

పుల్లయ్య క్రింద కూర్చున్నాడు. రామనాథం సిగరెట్టు వెలిగించి.

"నీ కథేమిటో పూర్తిగా చెప్పు"

"ఇప్పుడు దేనికండి. అందులోనూ కథేముంది?"

"అది కాదోయ్ ! అసలు ఎందుకు చంపావ్?"

"చెప్పటం నాకు యిష్టంలేదండి. చంపినది నేనే కాబట్టి శిక్ష విధించండి."

"అదేమిటోయ్ ! ఊరికే అలాగంటే సరిపోతుందా ? నీకు అన్యాయంగా శిక్షవేస్తే దాంట్లో న్యాయం, ధర్మం ఏముంది ?"

"దీనిలో అన్యాయం ఏంలేదండి. నేను శిక్షార్హుడనే"

"అదికాదు పుల్లయ్యా. ఊరికే అలా భీష్మించుకు కూర్చుంటే ఏంలాభం ? ఇంతవరకు నేను ఇటువంటి కేసును వినలేదు. ఇప్పుడు నేను బ్రతిమిలాడుతున్నాను. నాతో ఒక్కడితో చెప్పు నీ కథ."

పుల్లయ్య జవాబు చెప్పలేదు.

"ఫరవాలేదు లే చెప్పు. నేను ఇంకెవరితో చెప్పనులే !"

పుల్లయ్య ఒక వేడి నిట్టూర్పువిడిచి తన కథ ప్రారంభించాడు.

♦ ♦ ♦

"నా భార్య లీల చాల అందమైనదండి. మేమిద్దరం చాలా అన్యోన్యంగా జీవించేవారము. నాకు రెండు ఎకరాల పొలముంది. ప్రతిరోజూ ప్రొద్దునే పొలానికివెళ్ళి సాయంత్రానికి తిరిగి వచ్చేవాడిని.

ఇలాగే చాల రోజులు గడచిపోయాయి. కాని కొన్ని రోజుల క్రిందట ఒకరిద్దరు నాతో అనడం ప్రారంభించారు శేఖరం మీ యింటికి ఎందుకొస్తాడని. అయినా నేను తొందరపడలేదు. ఒకసారి ప్రత్యక్షంగా చూస్తేగాని దేనినీ నిర్ణయించకూడదనుకొన్నాను.

ఆ రోజుకూడా ఎప్పటిలాగే భోజనంచేసి పొలానికి బయలుదేరాను. కాని కొడవలి మరచిపోవుట వలన తిరిగి ఇంటికి వచ్చాను. కాని తలుపు గడియ వేసుంది. మా యింటికి ఒకేదారి. రెండుమూడు సార్లు తట్టాక లీల తలుపు తీసింది. లీల ముఖంలో కళలేక, భయం జాస్తిగాయుంది. నాకు కొంచెం అనుమానం కలిగింది. ఎందుకలాయున్నావ్ అంటే ఏమీ లేదంది. తరువాత కొడవలికొరకు పెద్దపెట్టె దగ్గరకు వెళ్ళాను. కాని లీల అడ్డంవచ్చి,

"ఏంకావాలి ?"

"కొడవలి"

"పెట్టెలోలేదు అటకమీదయుంది కాబోలు" అన్నది తొట్రుపాటుతో.

కాని నాకు బాగా జ్ఞాపకం, నిన్న సాయంత్రం కొడవలి పెట్టెలో పెట్టానని. లీలను ప్రక్కకునెట్టి పెట్టెమూత తెరిచాను.

కాని ఆశ్చర్యం ... లోపల దృశ్యం చూడగనే నిర్ఘాంతపోయాను. లోపల నిజంగా శేఖరం!

సంగతి అర్థంచేసుకొన్నాను. శేఖరం సగంచచ్చి బయటకు వచ్చాడు. నాకు ఆవేశం వచ్చింది. కాని దీనిలో తప్పెవరిది ? లీలదేగా ? లీల రమ్మంటేగా శేఖరం వచ్చాడు. ఒక్క నిముషం ఆలోచించి శేఖరాన్ని వెళ్ళిపొమ్మన్నాను. శేఖరం వెళ్ళిపోయాడు. ఎదురుగుండా లీల. ఛీ! అది బ్రతికేం లాభం ? అటువంటి నీచురాలికి ఈ భూమ్మీద స్థానంలేదు. ఒకవేళయున్నా అందరూ తలోక విధంగా అనుకొంటారు. సంఘం వెలివేస్తుంది.

వెంటనే పెట్టెలోని బాకును తీశాను. లీల వణకసాగింది. కంఠంలో బలంగా పొడిచాను. కేకలు వేసింది. కాని మరో నిముషంలో ప్రాణాలు ఎగిరిపోయాయి. అంతలోనే ఇరుగుపొరుగు వారందరూ వచ్చారు. "

పుల్లయ్యకథ ముగించి "బాబూ నా కథంతా విన్నారు. ఇక నాకు జీవితంమీద ఆశలేదు. దయచేసి రేపు మీరు మరణశిక్ష విధించాలి" అంటూ రామనాథం కాళ్ళమీద పడ్డాడు.

రామనాథం కిటికీలోనుంచి శూన్యాకాశంలోకి చూశాడు.

♦ ♦ ♦

కోర్టంతా కిటకిట లాడుతున్నది. జడ్జి రామనాథం వచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

కొంచెం సేపటికి జడ్జిలేచి "పుల్లయ్య నిరపరాధి. అతను నేరస్థుడుకాడు కాబట్టి క్షమించి వదిలివేస్తున్నాము." అన్నాడు.

జనం అంతా ఆశ్చర్యపోయారు. కాని పుల్లయ్య కోపంతో "ఇదేం తీర్పండి ? నన్ను ఏముఖం పెట్టుకొని బ్రతకమంటారు. నన్ను నేను శిక్షించుకోలేనా!" అంటూ రహస్యంగా బొడ్డుక్రింద దాచుకొన్న కైజారునుతీసి గుండెలో పొడుచుకొన్నాడు. ఇంక ఈ కాగితాలు అనవసరం అని రక్తం చిమ్ముతూ జడ్జి ముందున్న కాగితాలమీదపడింది. బయట సినిమా పాట వినవస్తుంది. "కర్మదాట వశమా, నరుడా, కర్మదాటవశమా !"

———



# రాచవీడు

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మ

శ్రీ తరుణీ సరస్వతులు చెన్నలరారుచు నెల్లవేళలన్
శీతల వారి పూరముల జిమ్మెడు వాహిని తుంగభద్రతో
భూతలమందు స్వర్గమని పూర్వులచే కడు మెప్పుగాంచివి
ఖ్యాతిని గన్నప్రోలు; తగదా! మనయాంధ్రులరాచవీటికిన్.

వీరుల గన్నకోట; సు కవీంద్రులపాలి వరాలమూట; సిం
గారపుఁ బూలతోట; నట గాయకవర్యుల రాచబాట చె
ల్వారు సమస్త సత్కళలనం దము లూరెడికోట కందనో
లారయ రాచవీడగుట యార్యజనాదరణంబుగాంచదో.

కల వీనాఁటికి మాసిపోక; అవిగో! కర్నూలులోఁదాంటి కో
టలునన్ బేటలగడ్తలున్ బురుజు లొడ్డారించుతుంగా తటాం
చల భూముల్; రణరంగదీర్ణ రిపు వక్షః కోష్ణరక్తౌఘ పం
కిల శోణమ్ములు; తత్పురీఘనత కీకీర్తిప్రభల్ చాలవో.

నట్టడవులనుచుఁగొండలు - గుట్టలనుచు; నందు గ్రుడ్ల గూబలు గూయున్
బట్టపగలే యటందురు కట్టా! మరచిరొకో; పూర్వగాథల నాంధ్రుల్.
నడి బొడ్డున నుండియెమును-పుడమినిఁ బాలించెనా! యపూర్వవిభవముల్
దొడరగ రాయలు; కటకము-కడదా కను తెలుగు వెలుగు గడలు కొనంగన్.

పదవులకుఁ బ్రాకులాడెడి ప్రముఖులెల్ల-జేరి సామ్రాజ్యలక్ష్మిచే జేతులారఁ
గోలుపోదురో ప్రజలకుఁ గూర్పఁగలరో-యేమిగానున్నదో గదా; యీశ్వరేచ్ఛ.

రెండు పార్టీలు పోట్లాడు చుండ నడుమ-బొంచి మూడవయది దానిఁబుచ్చికొనదె
యటులెగాకున్న బళ్ళారి యరిగియున్న-జేసితిమిగాదె యా కర్మ చేతులార

ఆంధ్ర రాజ్య లక్ష్మి యవతరించెనో లేదో పురిటిలోనే కింక పుట్టు చుండె
ఎల్లగండములను మెల్లగాఁ దొలఁగి దీర్ఘాయువై శుభమ్ములందుఁగాక.



# ఆంధ్ర జానపద గేయవాఙ్మయ చరిత్ర

## జంగంకథ

శ్రీ ఏటుకూరు మల్లికామేశ్వరరావు

(గతసంచిక తరువాయి)

### ఛందో వైవిధ్యం

జంగం కథలలో ఛందస్సు అనేక పోకడలు పోయింది. సాధారణంగా పుస్తక ప్రారంభంనుంచి చివరిదాక ఒకే లక్షణ ముంటుంది. ఒక వేళ మార్పు ఉంటే అది తాత్కాలికమే. ఈ పుస్తకాల వివిధ ఛందస్సులను ఇక్కడ ఉదహరిస్తాను.

కాంభోజరాజుకథ

కుర్చీమీద కొలువుతీరింది తందాన తాన
తొమ్మిదో గడియలోగాను ,,
బాలుడే ప్రసన్నమౌతున్నాడు ,,
లక్ష్మీదేవి బొడ్డుగోసెను ,,

(15-వ పుట)

చిన్నమ్మకథ

అత్త కట్టిన కట్టులన్నియు విప్పినాదిగా
కంకణహస్తములతల్లి కడవలోవేసింది
వక ఇంతటి కబళముతల్లి వడ్డించబోయె
అట్టి మాటలకుస్వామి ఆలోచనచేసెను

(13-వ పుట)

కుమార రామునికథ

తండ్రి ఎరుకలేకుండ
కుళ్ళాయీలు పెట్టిరి
జరీ అంగరకాలు తొడిగిరి
రుమాల నడుములగట్టి
చెట్ట పట్టాల్ పట్టుకొని
పెద్ద బజారుకి వచ్చిరి
అక్కడ కోమటివారి పిల్లలు ॥తందాన॥
బ్రాహ్మణవారి పిల్లలు
జరిపట్టీలాడేరు

(16.వ పుట)

బాలనాగమ్మకథ

పిల్లలంతా గుంపులుకూడిరి ॥తందాన॥
ఇసుకబట్టి పప్పుచేసినాడు ,,
చిల్ల పెంకుల వరహాలు చేసెను ,,
దొడ్డవాడవు జంగందేవర ,,

(51-వ పుట)

బంగారు తిమ్మరాజుకథ

నారప్పను సవారితోను ఎదురు తగులు తాడు
పెనుగొండ పర్ణశాలకు దివానునంటాడు
సలామందుకొని చీటి ఇమ్మని నవుకరు చెప్పుతాడు
పింతండ్రని ఒళ్లు ఎరగక దండం పెట్ట కుమీ!

(7.వ పుట)

పెద్దబొబ్బిలిరాజుకథ

కపటమాటలు చెప్పినాడు దుబాసి
లక్ష్మడు
ఎత్తినకత్తి దిండుమీదనే తాయిగ
పొడిచెను
చదురువిడిచి లేచినాడు ధర్మారాయుడు
డేరావిడిచి బయలుకొచ్చెను ధర్మా
రాయుడు

(66.వ పుట)

దేశింగురాజుకథ

వారటు చక్కెర పంచిరప్పుడు వరస
వీధులను
పరమ ముదంబున వచ్చినవారికి బహు
మతులనుఇచ్చె
అరయగ కొలువుననున్న జనులకునట
ఇనాములిచ్చె
పుత్రునిజూచి సంతోషంబున పొంగెను
రాంభాయి

(14.వ పుట)

నల్లతంగాళ్ కథ

బంగారు సొమ్ముతీసి పాడుచేయవచ్చు
నేమో
తలుపులన్నియుమూసి మీరు తాళ
ములు మూయవలె
గడపలన్నీ మీరు గడియలు మూయ
వలె
మాళియలంకారి మూదేవి చెప్పినట్లు

సన్యాసమ్మకథ

వలవల కన్నీళ్లు కారుచున్నవిగా బాల
కును
గోడుగోడునబాల ఘోషపెట్టెను ఆ
బాల
నా నొసటి లిఖితము నులిపితే చెడిపోదు
దైవము
ఆ విష్ణు ఈశ్వరులను తలచుచున్నదిగా
ఆ బాల

కామమ్మకథ

భీమవరపు కాలువఒడ్డు కొచ్చింది
కామమ్మ
ఒడ్డుమీదనె గంగ పొర్లుచున్నది
కాలువ
పొంగే గంగను కండ్లచూచింది
కామమ్మ
పొర్లే గంగప్ప పాటియ్యవమ్మ గంగప్ప

పై వరసలన్నిటిలోకి బొబ్బిలిపాట వరసకే ఈ కాలంలో జనత (Popularity) ఏర్పడింది. ఇప్పుడు అనేక ఇతర కథలు ఆ వరసలోనె బయలుదేరేయి.

## కొన్ని ప్రత్యేకపు సొగసులు

ఈ కథలు ఈ పాటల చక్కదనంకోసం కొన్ని పద్ధతుల ననుసరించేరు. వాటిని గురించి కొంచెంగా వివరిస్తాను.

ఒక్కొక్కప్పుడు ఒకే చరణాన్ని పునరుచ్చరించడం అందం. ఈ కింది ఉదాహరణలో రెండో చరణం అట్లు చెప్పబడింది.

పొన్నలు, పొగడలు, బొండుమల్లెలును
ఆ మంచి పాన్పున అవి చాల పరిచి

జామున పూసిన జాజి పువ్వులను
ఆ మంచి పాన్పున అవి చాల పరిచి
అప్పుడే పూసిన అచ్చ మల్లెలను
ఆ మంచి పాన్పున అవి చాల పరిచి

ఒకే విధమైన క్రియను ప్రతి చరణంలోను ఉచ్చరించడం ఒక అందం.

ముత్యాల ముగ్గులు పెట్టేటివారు
మాణిక్యాల దివ్వెలు పట్టేటివారు
మకరతోరణాలు కట్టేటివారు
పచ్చాకు పందిళ్లు వేసేటివారు

చెప్పిన దానిని మార్చి మార్చి చెప్పడం ఒక విధానం.

అడవిలో యేడ్చేదు అబల యెవ్వ
రమ్మా నీవు
వనమున యేడ్చేదు వనిత యెవ్వ
రమ్మా నీవు
ఒంటిగా యేడ్చేదు కారణమేమమ్మా
నీకు
కానసమందేడ్చు కారణమేమమ్మానీకు
(నల్లతంగాళ్ కథ 16, 17 పుటలు)

ఒకే మాటను వర్ణించడం ఒక లక్షణం. దీనిలో సంతానంలేదు అన్నమాట వర్ణించబడింది.

కాశీవెళ్లినా గయవెళ్లినా సంతానము
లేదు
సప్తసాగర యాత్రలుచేసినా సంతా
నములేదు
కోటి పల్లి భద్రాచలంవెళ్లినా సంతా
నములేదు
(బంగారు తిమ్మరాజుకథ, పుట-1)

ఆట్టిదే మరొక నిదర్శనం.

భూమి దేవితో ఆకాశముతో ఒట్టువున్న
దండి!
తల్లి, తండ్రితో తమ్ముడిపైన ఒట్టు
వున్నదండి!
సవతులపైన దేవుడిమీద ఒట్టువున్న
దండి!
(బంగారు తిమ్మరాజుకథ, పుట-3)

ఇల్లరికపు టల్లుడికి ఇంటి పెత్తనం అప్పగించేరని చెప్పడానికి అని.

సొమ్ములపెట్టె బీగము అమ్మయ్య
వెంకయ్యకు ఒప్పగించినారు
వరహాలపెట్టె బీగము అమ్మయ్య
వెంకయ్యచేతికి ఒప్పగించినారు
ఇంటిలోయుండే లెక్కలు అమ్మయ్య
వెంకయ్యకే ఒప్పగించినారు
బేరసారము లెక్కల గనుకను
వెంకయ్యకే ఒప్పగించినారు

ఎదుటి పాత్రకు విజ్ఞాపించడానికి (appeal) పునశ్చరణ (Repetition) ఇట్లుంది. కోమటిచేతిలో పణతి పడింది. ఆమె తనను విడిచిపెట్టమని ఇట్లు బతిమాలు కొంటూంది.

అన్నా! అన్నరో! కోమటి అన్నయ్యా!
వదలిపెట్టుమా కోమటి అన్నయ్యా!
ఆడు తోడునను బుట్టవె అన్నయ్యా!
ఆడుగోడున పోకుము అన్నయ్యా
ఇతర కాంతలు తల్లులు అన్నయ్యా!
ఇతర భామలు అక్కలు అన్నయ్యా!

నన్ను ముట్టకు పాపం అన్నయ్యా
అన్నా! అన్నరో! కోమటి అన్నయ్యా!
(బంగారు తిమ్మరాజు కథ పుట-12)

ఒక పాత్ర మనోనిశ్చయాన్ని తెలియజేసేటప్పుడు కూడ పునశ్చరణపదముంది. బాలరాజులో పణతి ఈలాగంటుంది.

దేహమెల్లా నీకు నిచ్చుదాన
ప్రాణమెల్లా నీకు నిచ్చుదాన
మనసుయెల్లా నీకు నిచ్చుదాన
ఆత్మయెల్ల నీకు నిచ్చుదాన
వదలిపెట్టినా వదలుదానగాను
భూమిలోదిగినా వదలుదానగాను
నీళ్లలోదిగినా వదలుదానగాను
అగ్గిలోదిగినా వదలుదానగాను
గాలిలో ఏగినా వదలుదానగాను
మింటబోయినను వదలుదానగాను
మంటదూరినా వదలుదానగాను

జానపదగేయరచనా విధానంలో అవి కొన్ని సొగసు మార్గాలు.

## కొన్ని అనవసరపు మాటలు, అక్షరాలు

ఏ పెద్ద పాటలోనైనా కొన్ని అనవసరపు మాటలు కనబడక మానవు. ఇవి పాదపూరణకు మాత్రమే పనికివస్తున్నాయి.

అది అను మాటకు ఉదాహరణం -

'తంబియొక్క సేనలకు తాబెట్టెను మాళి యది.'

బంగారు తిమ్మరాజుకథలో ఊతపదం 'రామా రామా రామా రామా రామా రఘురామ!' అది అట్లుండగా పాదమధ్యంలో 'రామ' అనే మాట అప్పుడప్పుడు కనబడుతూంటుంది.

శేషపట్నములో భేరీ వేసెను రామా రవు తప్పుడు.

(పుట-4)

ఏమి మాటకు ఉదాహరణం జటంగముని వర్ణనలో ఉంది -

ఆయన శిరస్సున రెండు వెదురు బొంగలేమి

వెదురు. బొంగులే నిల్చివున్నవయ్యా!

ఇట్లే ఈ గేయాలల్లో అనవసరపు అక్షరాలుకూడ వస్తూంటాయి. 'ఆ' అను అక్షరానికి బాలనాగమ్మ కథలో -

పులిరాజు యా పట్టణం వచ్చినాడు

... ... ... ... ...

పులిరాజు యా కచ్చేరికి వచ్చెను

'ద' అనే అనవసరపు టక్షరం బొబ్బిలి పాటలో తరుచు కనబడుతూంటుంది -

అప్పుడేమి చేస్తున్నాడు రంగారావు ద

ఓ అనే అక్షరానికి లక్ష్మమ్మపాటనుంచి నిదర్శనం-

నీ యొక్క వో కుమార్తె నమ్మయ్యా!

... ... ... ... ...

ఆడబిడ్డ వో కొడుకు యమ్మయ్య
(25.వ పుట)

ఈ అక్షరాలకు ఆ సందర్భంలో అర్థంలేక పోయినా పాట తూగుకుకి ఇవి ఒక్కొక్కప్పుడు ఉపయోగపడుతూంటాయి.

## ముద్రణ

ఈ వాఙ్మయమంతా గుజిలీ ప్రతులలో మక్కిపోతూంది. వివిధరంగుల కాగితాలమీద, పీచు కాగితాలమీద, రేపరు కాగితాలమీద వీటి ముద్రణ! వీటిలో చరణ విభజన ఉండడంకూడ ఒక వరం వంటిదే! చదువురాని పాటకుల భాషాలోపాలు,

ఉచ్చారణ దోషాలు సవరించే దిక్కు లేదు. అంతే గాక పీటికి ప్రూఫ్‌రీడర్లు కూడ లేరా అనిపించేటటు వంటి అచ్చు తప్పులు! ఛందస్సు తప్పులు, భావం తప్పులు, సంప్రదాయం మెరుగక చేసే తప్పులు బోలె డన్ని. ఒక్కొక్క ప్రతిలో ఒక్కొక్కలా గుండడం కూడకద్దు. కాబట్టి వీటిని శ్రమపడి సవ రించి ముద్రింపించడం భాషాసేవకుల విధి.

## అచ్చయిన జంగంకథలు

అచ్చయిన జంగంకథలే కొన్ని కొన్ని లభ్యం కావడం లేదు. కాళియ మర్దనం, మల్లమదేవిచరి త్రము అను జంగంకథలను పమ్మి త్యాగరాయశెట్టి, పాతచాకలిపేట మదరాసువారు అచ్చువేసేరు. అవి దొరకటం లేదు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం వారు 1952 లో కాటమరాజుకథ, కొమారరాముని కథ అచ్చువేసేరు. ఇవి అంతకు మునుపే గుజిలీప్రతులలో అచ్చయేయి. కాని ఆ ప్రతులు దొరకడం లేదు. ఇట్లే లభ్యం కాని ఇతర ములుకూడ ఉన్నాయి. ఇట్టి వానిని సేకరించడం ఒక విధి.

## సేకరించవలసిన రచనలు

ఇంతవరకు సేకరించబడని జంగంకథలు బోలెడన్ని ఉన్నాయి. ఏలూరు ప్రాంతంలో రావులమ్మ కథ ఉంది. అది ముద్రణ భాగ్యం పొందలేదు. విజయ నగర ప్రాంతంలో ఈక్రింది వృత్తాంతకల కథ ఉంది. నీలాల అప్పడు అనే అతను నాటిన అరటిమొక్కను సలపల అమ్మినాయుడు తెగకొట్టేడు. ఆ పైన ఇద్దరు కొట్లాడుకొన్నారు. ఈ పాట ప్రచారంలో ఉంది కాని ముద్రించబడలేదు. "ఇంచుమించుగా 50 తందానకథలు ముద్రణలేక మునిగిపోతున్నవి. (చూ. జాతిరత్నాలు అను గ్రంథపీఠిక.") ముసలమ్మకథ * అను పాట రాయలసీమలో ఉంది. దానిని సేక రించాలి.

వదినె చూపోపమిచే నీలాపనిందలపాలయి కడు నిడుములబడి, కడకు సుఖించిన అక్కమ్మ అను మాన వతికథ ఉంది. ముత్యాలనాగమ్మకథ ఒకటి. అదేమనగా-నాగమ్మ శీలాన్ని చెరచడానికి తోడి కోడళ్లు చాకలి సాయంతో సన్నాహాలు చేస్తారు. నాగమ్మను బలాత్కరించిన చాకలి దుడుమన్న, నాగమ్మ బావగారి గండ్రగొడ్డలికి ఆహుతి అవుతాడు, నాగమ్మ భూదేవి ఒడిలో తలదాచు కొంది. ఇది లక్ష్మమ్మకథవంటిది * కదిరి బాలుని చరిత్ర అనుకథ ఉందని తెలుస్తూంది.

* అక్కమ్మ, నాగమ్మకథల విషయమై పైకొం చెమును Andhra University Colleges Magazine & chronicle Vol. XIII లో జానపద సాహిత్యము (తూమాటి దోణప్పగారు ఎమ్. ఏ. రచించినది) అను వ్యాసంలో ఉంది.

క్రీ. శ. 1575 ప్రాంతపు రచన యనదగిన చంద్ర శేఖర శతకంలో కొన్ని పాటల సంగతి చెప్పబడింది.

ఉ॥ ఇంటిని తిమ్మరాజుకథ, యింటిని యీర్ల
కతా ప్రసంగముల్
యింటిని పాడులాలి యిబ, మింటిని
నాయకురాలి శౌర్య, మె
ప్పంటికి నందివాక్యముల పాండు
చరిత్రన, నాకు భాగ్య మె
న్నంటికి గల్గునోయను నవజ్ఞుడు
మూర్ఖుడు చంద్రశేఖరా!

ఈ గ్రామ్య కవిత్వంలో చెప్పబడ్డ బంగరు తిమ్మరాజు, పల్నాటి వీరులచరిత్ర మనకు తెలుసు. మిగత పేర్లను పోల్చుకోడమే కష్టంగా ఉంది! దానిలో నంది వాక్యములు, పాండుచరిత్ర అని చెప్పబడ్డపాట లెక్కడున్నాయో!

* The art heritage of Vijianagar Empire'Vizianagar commemoration Number,Andhra Historical Research Society, Rajahmundry,1950.

# దృష్టి దానానికి కొత్త మార్గాలు



ఉక్రేనియన్ నేత్ర వైద్యశాస్త్ర పరిశోధనా సంస్థవారు, కంటి జబ్బు కుదరడం అసాధ్యమనే స్థితికి ముదిరి పోయినప్పుడు మళ్లీ దృష్టిని ప్రసాదించడానికి కొత్త మార్గాలు కనుగొన్నారు.

సంస్థ అధిపతీ, ప్రఖ్యాత సోవియట్ శాస్త్రజ్ఞుడు ప్రొఫెసర్ వ్లాదిమిర్ ఫిలటోవ్ ఒక టాస్ విలేఖరితో యిలా అన్నారు: సోవియట్ నేత్ర వైద్యులు నేత్రవ్యాధుల చికిత్సకు అధునాతన పద్ధతులను ఎక్కువగా వుపయోగిస్తున్నారు. నేనూ, నాశిష్యుడు ఎసిస్టెంట్ ప్రొఫెసర్ వ్లాదిమిర్ షెవలెవ్ సూచించిన శస్త్రచికిత్సను వారు ఆమోదించారు; దిగువ కనురెప్పక్రింద పరోటిడ్ సెలివరీ గ్రంధి (ఉమ్మినిచ్చేగ్రంధి) యొక్క నాళమొకదానిని అతకడం యీచికిత్సలో జరుగుతుంది. ఈ ఆపరేషన్ మూలంగా, లాక్రిమల్ గ్రంధి (కన్నీరు నిచ్చేగ్రంధి) క్షీణించి పోవడం ఫలితంగా కంటిగుడ్డు ఎండిపోవడం వల్ల అంధులైనవారికి మళ్లీ దృష్టినివ్వడం జరుగుతుంది. ఆపరేషన్ జరిగిన తరువాత, కన్నీరుకు బదులు ఉమ్మి కంటికి చెమ్మనిస్తుంది. ఇంతవరకు వైద్య గ్రంథాలన్నీ యీ వ్యాధి కుదరడం అసాధ్యమని భావించేయి.

వ్లాదిమిర్ షెవలెవ్ అప్పుడే అటువంటి ఆపరేషన్లు అనేక డజన్లు చేసి పూర్తి విజయం పొందేరు. ఇటీవల ఆయన, కళ్లు పూర్తిగా ఎండిపోయిన రోగులకు మాత్రమే కాకుండా, యీ వ్యాధి ప్రారంభమైన వారికికూడా ఆపరేషన్ చెయ్యడం ప్రారంభించేరు. దీనివల్ల వ్యాధి ఎక్కువకాకుండా, యీవ్యాధి ప్రారంభమైనవారికి కూడా ఆపరేషన్ చెయ్యడం ప్రారంభించేరు. దీనివల్ల వ్యాది ఎక్కువకాకుండా అరికట్టడం, రోగికి మంచి దృష్టిని ప్రసాదించడం సాధ్యమవుతుంది.

ఈ సంస్థకు చెందిన సీనియర్ శాస్త్రజ్ఞుడు, ఎస్. బారాష్ కంటిలోని తెల్లగుడ్డును అతికే ఒక కొత్తపద్ధతిని కనుగొన్నాడు; దీనివల్ల ఏడాది వయసుగల పిల్లల కళ్లకూడా ఆపరేషన్ చెయ్యడానికి వీలవుతుంది. ఆయన కనిపెట్టిన పద్ధతి పిల్లల్లో అంధత్వాన్ని పోగొట్టడానికి చాల ముఖ్యమైనది.

ఈ సంస్థ వుద్యోగులు నేత్రవ్యాధులకు మంచి కొత్త ఛికిత్సా పద్ధతులను కనుగొనడానికి కృషిచేస్తున్నారు.

'టాస్'



# స్వయంవరం

శ్రీ గోపరాజు వెంకటానందం

శ్రీమతి ,, సీతామహాలక్ష్మి

సీత:-ఏమండీ! నిన్న మీరు అమ్మాయి పెండ్లినిగురించి భగవంతంగారు కబురు చేశారని చెప్పారుగదా! ఏమైందాసంగతి. మళ్లీ చెప్పారే కారు.

ప్రకాశం:-ఆ! ఏమీలేదు. నేను నిన్న మధ్యాహ్నం ఆఫీసుకు వెడ్తూంటే, మనోహరం మేనమామ భగవంతంగారు చెప్పారు — "ఏమోయి! మావాడికి యితరత్రా చాల సంబంధాలు వస్తున్నాయి. మరి —ఇదివరకు దాకా అంతా ఏవో అనుకుంటుంటే వారు—మీ అమ్మాయిని మావాడికిచ్చి వివాహం చేస్తారని. అదేదో కనుగొని మరీమాట యిద్దామని మేము ఆగాం. మరి ఏమిజేశావు" - అని అడిగాడు.

సీ:-ఆయనలా అంటే మరి మీరేమన్నారూ!

ప్ర:-నేనా! నిన్ను అడగందే ఏట్లా చెబుతాను. "సరేలే — ఇంట్లో కనుగొని చెబుతా"నన్నాను. అప్పుడాయన రెండు మూడు రోజులలో ఏసంగతీ చెప్పమన్నారు.

సీ:-ఏంచేద్దాం.

ప్ర:-నువ్వేమంటావు?

సీ:-నే జెప్పేది ఏముందీ — అన్నీ మీకే తెలుసుగా! (కొంచెం ఆగి) మనోహరం మంచివాడేగాని వారికి ఏమీ ఆస్తిపాస్తులు లేవుటగా. ఏదో సంపాదించుకుంటున్నాడు. బాగానే యుందిగాని, చూస్తూ చూస్తూ ఆస్తి ఏమీలేని వాని చేతిలో మన అమ్మాయిని ఎట్లాగండీ పెట్టేది. అదే నాకున్న అనుమానం.

ప్ర:-ఔను బాగా చెప్పావు. కాని వఱ్ఱవాడు క్రొత్త ఉద్యోగంలో జేరినప్పటినుండి ఏదో సంపాదించుకొంటున్నాడే. ఏమో! మన అమ్మాయిని చిన్నప్పటినుండి పెంచి చదువుచెప్పిస్తూ యుండేది మీ అన్నగారు. ఆయనేమంటాడో? మనమంతా అంగీకరించినా, తీరా అమ్మాయి ఏమంటుందో!

సీ: దాని మొఖం దానికేమి తెలుసు. దాని నడిగితే ఆస్తి యున్నా లేకపోయినా అతనినే వివాహమాడ్తానంటుంది. అయినా, మీరుకూడా తెలుసుకో వచ్చు — దాని అభిప్రాయమెలాగుందో. దానిని అడిగి చూడండి. అదైనా చిన్నపిల్లకాదు. వయస్సువచ్చింది. శుభ్రంగా చదువుకొంటోంది.

ప్ర:-సరే! పిలిచి అడుగుతానుండు. అయితే, ఇదివరకుదాకా మన అమ్మాయ్యి, మనోహరంకూడా మీ అన్నయ్యవద్ద చాల చనువుగా పెరిగారు కదా! వారిద్దరు ఒకరినొకరు ప్రేమించుకొని, వివాహం చేసుకొందామని స్థిరపరచుకొన్నారుట. నిజమేనా?

సీ:-(కోపంతో) ఊరుకోండి! ఎవరైనా వింటే నవ్విపోగలరు. మీరుకూడా తగ్గవారే దొరికారు. లోకులు కాకులు వంటివారు. గాలిలో అనేకం పుట్టిస్తూ యుంటారు. అవన్నీ నమ్మి వేయడమేనా! ఇదిగో యిప్పుడే చెప్పేస్తున్నాను — మనోహరంమీద మా అన్నయ్య కెంత మోజున్నా, అమ్మాయి అతనినే పెళ్లాడుతానన్నా, మీరు మాత్రం ఆ సంబంధాని కంగీకరిస్తే, నేను అంగీకరించను. అమ్మాయికైనా వయస్సు వచ్చిందన్న మాటేగాని - ప్రపంచమంటే ఏమిటో తెలియని పిల్ల. దానికిప్రేమ, ప్రేమించడంకూడా తెలుసా!

ప్ర:-తొందరపడకు. అసలు, లోపల నిప్పులేందే పొగరాదుకదా! లోకులుమాత్రం అంతగ్రుడ్డీగా

అంటారా! చివరకు అంతా — కాదూ కూడదనీ, అమ్మాయే అతనిని పెళ్లాడుతాననే పట్టుబడ్తే, మనోహరానికి యివ్వక ఏంజేస్తారు? ఆస్తి విషయంలో మనకేముందో అతనికీ అదేవుంది.

సీ:–ఇదిగో — ఏమైనా సరే — మీరు అమ్మాయిని కనుక మనోహరానికిచ్చారా, నేను ఏనుయ్యో గొయ్యో చూచుకొంటాను. ఏమిలేని మిమ్మల్ని చేసుకొని నేను అనుభవిస్తున్నానుగా! అంతా కాదూ కూడదనడానికి, మన అమ్మాయి పెండ్లికి మన యిష్టంకాని యితరులెవరు? అదిగో అమ్మాయే యిలా వస్తోంది.

లలిత:–అమ్మా! మా మేష్టరు ఈ నెల స్కూలు జీతం తెమ్మన్నారు. అడిగితెచ్చుకొనడానికి పెద్ద మామయ్యగారింటికి వెడ్తున్నా.

ప్ర:–అమ్మాయీ! ఇలారా అమ్మా! నిన్నొక విషయం అడుగుతాను — నిజంచెప్పమ్మా. మరినీకు ఎవరిని పెండ్లాడాలని యుంది.

ల:–(నెమ్మదిగా సిగ్గుతో) మీరు చెప్పేవి అన్నీ అబద్ధాలే. చెప్పమంటారుగాని నిజంగా నేను చెప్పినట్లుచేస్తారు గనుకనా!

ప్ర:–అలాగే చేస్తానమ్మా. చెప్పు.

సీ:–చెప్పవే — మీమామయ్య, అమ్మమ్మ కలసి నీకు ఏదో కొండమీద సంబంధం పెద్దది తెద్దామనుకుంటున్నారు.

ల:–(కోపంతో) అసలు యిప్పుడు నా పెండ్లి మాట ఎందుకు! నా చదువు పూర్తిఅయితేనేగాని పెళ్లి చేసుకోనని ఎన్ని సార్లు చెప్పను. — నేను పెద్ద మామయ్యగారింటికి వెళ్లిపోతున్నాను.

సీ:–ఏమండోయి — చూశారా! దీని మంకుతనం. దీనికి ఆ మనోహరాన్ని పెండ్లి చేసుకోవాలని యుంది. దీని మొఖాన్కి సుఖపడేయోగ్యతలేదు కాబోలు. దీని నిప్పటినుండే లొంగదీస్తేనేగాని వీలులేదు. దీనిపని చెబుతా నుండండి.

(తెరపడును)

## ౨

(ఆ గ్రామంలోనే మనోహరం యింట్లో)

ల:–ఏమండీ బుచ్చమ్మగారూ! మీ అబ్బాయికి మా మామయ్య పుస్తకాలు కొనిపెట్టమని డబ్బు యిచ్చాడుట. ఎక్కడున్నారండీ ఆయన.

బుచ్చమ్మ:–వంటపొయ్యి దగ్గరుంటాడేమిటమ్మాయి! వెళ్లి చూడు వాడిగదిలో యున్నాడేమో.

ల:–ఏమోయి మనోహరం కనిపించడమే మానేశావు. ఈ మధ్య పత్రికలలో మహాజోరుగా పడ్తున్నావే! దెబ్బలేమీ తగలడంలేదుగదా!

మనోహరం:–పత్రికలలోపడ్తే దెబ్బలు తగలవుగాని, నలుగురినోట్లోనుపడ్డా, ఆడవారి మాయమాటలలో పడ్డా జీవితాలకే దెబ్బతగిలి మాననిగాయాలవుతాయి.

ల:–అబ్బో–కవిత్వంతోబాటు వేదాంతంకూడా మాట్లాడుతున్నావే. ఈ క్రొత్తవిద్య ఎప్పుడు నేర్చుకొన్నావు?

మనో:–నువ్వెరగవు కాబోలు. ఈ మధ్య గుడివాడలో జరిగిన వేదాంత సభలకు వెళ్లాను. అక్కడ బాగా బోధపడింది! పెద్దవాళ్ళమనుకొంటూ, బాధ్యతగల సంరక్షకులమని చెప్పుకొనేవారు, ధనాశకులోబడి ఎన్ని జీవుల ఉసురుకు గురిఅయ్యేదీని. పైగా ఈ మహానుభావులే బహిరంగసభలలో స్వయంవరాలు జరిగేపద్ధతి కావాలని అరుస్తూంటారు.

ల:–ఏమిటి మనోహరం. ఈ వేళ అలాగు మాట్లాడుతున్నావు. కడుపులో అలా బాధపడేబదులు నాకుకూడా చెప్పరాదూ – అదేదో వింటాను.

మనో:–చాలు చాలు – ఎందుకులే నిన్నుకూడా బాధపెట్టడం. అదీగాక అమాయకురాలిలా నీకేమీ తెలియనట్లుగా మాట్లాడుతున్నావులే.

ల:–నాతోడు. నిజంగా నాకేమీ తెలియదు.

మనో:-ఏమీలేదు. చెప్పమంటావా! వచ్చే నెలలో నా వివాహం. అప్పుడే మావాళ్లు అన్ని ఏర్పాట్లు చేసేస్తున్నారు. నీవు తప్పక రావాలిసుమా!

ల:-ఓహో! అదా విషయం. అలాగు చెప్పు. మరి నేనెలాగ వచ్చేది? నా వివాహంకూడా వచ్చే నెలలోనే. బహుశా ఆ ముహూర్తానికేమో కూడా. అన్నట్లు ఆ నెలలో ఒక్కటేగా మంచి ముహూర్తముంటా. అలాగైతే నా పెండ్లికూడా ఆ ముహూర్తానికే అవడంవల్ల, నేను నీ వివాహానికి రావడానికి వీలుండదు.

మనో:-(రోషంతో) అయితే వరుడెవరు?

ల:-పెండ్లికొడుకే దొరకడేమిటి! కావాలంటే కావలసినంతమంది కాసి పెట్టుకొని కూర్చున్నారు. మీకు కాబోయే ఆ అర్ధాంగి ఎవరో తెలుసుకోవచ్చునా!

మనో:-చెప్పను. నీకు నాకు సంబంధంలేనప్పుడు చెప్పడమెందుకు. పెండ్లినాడే చూద్దువుగాని. మీ జమీందారీ తనానికి మేము పనికివచ్చాం కాము. నేను చూస్తానుగా - మీవాళ్లు నిన్ను ఏ జమీందారు బిడ్డకిచ్చి పెళ్లిచేస్తారో, అప్పుడైనా సుఖపడుదువుగాని పాపం. స్త్రీలు చంచల మనస్కులని నాకిప్పుడు బాగా బోధపడింది.

ల:-(ఆశ్చర్యపోతూ, కోపంతో) మనోహరం! అసలు విషయమేమిటో చెప్పకుండా యిన్ని చదువుతావెందుకు? ఔనులే. నేను మొదట్లోనే అనుకున్నాను. ఈ మగవాళ్లు నమ్మించి గొంతుకకోస్తారని. నీకు నాకు సంబంధంలేదని యిప్పుడు చెప్పడంకంటే, ఆ మాటలు మొదట్లోనే చెప్పకపోయావు! నేనింత మోసపోయియుండకపోదును.

మనో:-నేనేమీ మోసంచేయలేదు. అంతా మీవాళ్లే చేసుకొన్నారు. నా తప్పులేకుండా నా విద్యుక్త ధర్మం నేను నెరవేర్చుకొన్నాను.

ల:-(కోపంతో) విద్యుక్తధర్మం-బాగా నెరవేర్చావు. ఏపాపం ఎరుగని నన్ను నమ్మించి మోసపుచ్చి, ధర్మం నెరవేర్చానని తప్పించుకో చూస్తున్నావు.

మనో:-మీ తల్లిదండ్రుల కోరిక ప్రకారం కొండమీద వానినే పెండ్లిచేసుకుంటే బాగుంటుందికాని - నా జోటివానిని నీవు పెళ్లాడితే ఆ ఆశాజీవులకెంతో అన్యాయంచేసిన దానవవుతావేమో!

ల:-నీ చెప్పేడు మాటలకేమి గాని - నా హృదయాన్ని మొదట్లో ఒకరికి అంకితంచేసి అర్పించాక, అందులో తిరిగి రెండవవారికి స్థానముండదు. నీవు చేసుకొంటే చేసుకోవచ్చు మరొక పెండ్లి. కాని నేను మాత్రం పెండ్లిచేసుకోకుండా యిట్లాగే ఉంటాను. లేకపోతే ఏనుయ్యో, గొయ్యో చూచుకొంటాను. భారత స్త్రీ పవిత్ర హృదయాన్ని నీ వింతవరకు గ్రహించకపోవడం చాల విచారంగానేయుంది. (అని కంట తడిపెట్టుకొనును.)

మనో:-లలితా-అలా ఏడిస్తే ఏమిలాభం. ఆ హితోపదేశమేమిటో మీ వాళ్లకుచెయ్యి. నేను యిప్పటికీ సిద్ధమే.

ల:-నా వివాహం నిర్ణయించడానికి నాతల్లిదండ్రులెవరు! నేను నిర్ణయించుకోవాలిగాని, కన్నంత మాత్రంచేత కన్యాధారకుకూడా వాళ్లకు హక్కేం దేమిటి? ఇంకా నా చదువు పూర్తికాలేదు. మన మిద్దరం పెండ్లిచేసుకోవాలంటే, నా చదువు పూర్తయ్యేవరకు ఆగు.

మనో: నీ హృదయంలోని అభిప్రాయం నీవు పైకి చెప్పగలిగినంత స్వతంత్రురాలవు కానప్పుడు, నీ చదువు ఆఖరువరకు ఆగి ఏమిప్రయోజనం. ఆడపిల్లలు ఎప్పటికైనా తల్లిదండ్రుల ఆజ్ఞలకు బద్ధులు కావలసినవారే. అందుకని అదేదో యిప్పుడే తేల్చివేసుకొంటే మంచిది.

ల:-అయితే యిప్పుడే తేల్చివేసుకొని పెండ్లిచేసేసుకో. నా కొరకు ఆగనక్కరలేదులే. మీ మగవారెంతకైనా సాహసులు. చూస్తూండగా ఆడవారిని

మాయమాటలచేత మోసపుచ్చి, గంగలో ముంచుతారు. చంచల మనస్కులు ఆడవారో, మగవారో యిప్పుడైనా తెలుసుకో. నీవు చేసుకొంటే చేసుకోగాని మరొకపెళ్లి, నీవు నామీద మాత్రం దయయుంచి, యింతవరకు మన యిరువురిమధ్య జరిగిన సంభాషణలు, సంఘటనలు మరచిపోవలసినదని కోరుతున్నాను. ఇంక నా కిక్కడ ఒక్క నిముషంకూడా నిలబడడ మిష్టంలేదు. నేను వెళ్లి పోతున్నాను. (అని వెళ్లిపోవును.)

మనో:-లలితా - లలితా - మాట - మాట.

(తెరపడును)

## 3

## [మనోహరం యింట్లో]

బు:-ఏరా భగవంతం! పిల్లను చూడడానికి మనోహరంతో మొన్న నీవుకూడా వెళ్ళావుగదా - నీ తుది అభిప్రాయమేమిటో చెప్పు.

భగవంతం:-అక్కయ్యా! నా అభిప్రాయం చెబ్తే మాత్రం ఏమిలాభం. చేసుకొనేవాడికి నచ్చాలిగాని.

సత్యము:-నీకు నచ్చితే వాడికి నచ్చక పోతుందేమిటి మామయ్యా! ఏమిటో వెర్రిగాని.

బు:-నచ్చడమేమిట్రా తమ్ముడూ! వాడిమొఖం - అందాన్ని కొరుక్కుతింటారేమిటిరా! పిల్లతండ్రి పెద్ద పండితుడు. చాలా మంచివాడుగా కనిపిస్తాడు. ఏదో బాగానే ముట్టజెప్తానన్నాడు కూడా.

భగ:-అదేమిటి అక్కయ్యా! ఆయన మంచివాడైతే మనకు వొలికింది ఏమిటే! ఆయనను కాదుగదా మనవాడు పెండ్లిచేసుకొనేది.

బు:-ఆయనకు మగపిల్లలుకూడా ఎవరూలేరు. ఏదో ఆస్తికూడా అమ్మాయిద్వారా ముట్టజెప్తానన్నాడు. ఈ రోజులలో అంత కట్నం యిచ్చేది ఎవరేమిటి ?

స:-మామయ్యా! నీవు ఆస్తికోసంచూడకు బ్రతికుంటే బలుసుకూర తినవచ్చు. కాని పిల్ల నలుపైనా, ఎరుపైనా, కనుముక్కు తీరువగా బాగాయుంటే చెప్పు. అంగీకరిద్దాం, లేకపోతే మానివేద్దాం.

బు:-(తొందరతో) అదేమిటీ-ఆలాగంటావు. ఇంత డబ్బు తగలేసుకొని యిందుకేమిటి వెళ్ళిచూచి వస్తా. ఏదోచెప్పి వానిని ఒప్పించడానికి బదులు నీవుకూడా అడ్డదిడ్డంగా మాట్లాడతావేమిటి. చాల్లే ఊరుకో. అసలు ఒకరినొకరు చూచుకొనే పద్ధతి యిప్పుడు వచ్చిందికాని-పూర్వం మేమంతా ఏనాడైనా ఎరుగుదుమా! పెద్దవాళ్లు ఏంజేస్తే అదేగాని. ఇంతకు మీ నాన్న చిన్నతనంలోనే పోవడంవల్ల యిదంతా నా నెత్తిన పడింది.

భగ:-అక్కయ్యా, వాడికి ఆ పిల్లను చేసుకోవాలని ఎంతమాత్రము యిష్టమున్నట్లు తోచదు. ఎందుకు వానిని బాధపెట్టడం. వాడి దృష్టి వేరేగా యుంది.

బు:-అదేరా నాయనా! వచ్చినచేటు. ఎన్ని సంబంధాలువచ్చినా ఏదో ఒక వంకబెట్టి నచ్చలేదంటూంటాడు. ఎలాగరా వీడితో-మార్గం -

సత్యం:-ఏలాగేమిటి! కక్కవచ్చినా, కళ్యాణం వచ్చినా ఆగదన్నారు పెద్దలు. అయ్యే రోజుకు అదే అవుతుందిలెద్దూ.

బు:-వీడొక కొరగానికొయ్య అయ్యాడురా తమ్ముడూ! వీడు మద్దత్తుతో కొంత, ఆ మనోహరం ఎదురుతిరుగుతున్నాడు - (కోపంతో) అయితే చేయకబోయావురా సత్యం - వాడికిష్టమున్న సంబంధాన్ని.

భగ:-ఓరేయి సత్యం! ఊరుకో - పోనీ లలిత సంబంధాన్ని గురించి ఆలోచించడానికి, వాళ్లు "తిన

దానికి తిండిలేకపోయినా, మీసాలకు సంపెంగ నూనె" అన్నట్లు చెట్టెక్కి కూర్చున్నారురా. పోనీ ఆ అమ్మాయి మేనమామకైనా తెలియవద్దూ. చిన్నప్పటినుండీ యిద్దరినీ తనేగా పెంచి పెద్దజేస్తా-ఏమిటో - ఆయనతో ఈ విషయం తలపెడ్తే, తనకేమీ తెలీయదని తప్పించుకుంటూంటాడు. అదొక గడుసుతనం. మళ్లీ సంఘసంస్కరణకర్త నంటూ పెద్ద పెద్ద కబుర్లు చెబుతాడు. ఆ అమ్మాయి తండ్రి ఒక అడివి మనిషి - పైగా అస్వతంత్రుడు.

స:-పోనీలెద్దు మామయ్యా! మనవాడికి వివాహం కాదనే భయంలేదు. దేవునిదయవల్ల ఏదో నెలకు డెబ్భై, ఎనభై రూపాయలు తెచ్చుకుంటున్నాడు - ఖాయమైన ఉద్యోగంకదా.

బు:-ఒరేయి తమ్ముడూ! వీడిలోనే ఉందిరా అంతా. ఆ కుర్ర నాగన్నను వీడిష్టంవచ్చినట్లు ఆడిస్తున్నాడురా. నాకుకూడా దీర్ఘరోగం పట్టుకుంది. నేనైనా యింకా ఎన్నో రోజులు బ్రతుకుతానన్న నమ్మకంలేదు. మీ యిష్టం వచ్చినట్లు చేయండి, నేనేమీ మాట్లాడను. ఆయనే కనుక యుంటే వీడిఆటలు సాగునేమిటి - నేను వెళ్లిపోతున్నానులే - నాకెందుకు.

(తెరపడును)

(సశేషము)

---(o)---

# ముసిముసి నవ్వులు

'నారపీచు'

భార్య "మానాన్నగారు పట్టిదుర్మార్గుడనడానికి మీకెంతసాహసం?"

భర్త "నిన్నుయెడబాసి ఒక్కక్షణమైనా జీవించలేనని మీనాన్నగారితో అంటే నాదహనసంస్కారాది కర్మలకు అవసరమయితే డబ్బు సాహాయ్యం చేస్తానన్నాడు"

♦ ♦ ♦

"వెంకీ! క్రిందపడెయ్యకుండా జాగ్రతగా పింగాణి పాత్రలను కడుగు"

"పరవాలేదులే అమ్మా! అవి తేలికవే కాబట్టి క్రిందపడి పగిలినా నాకాలికేమి దెబ్బ తగలదులెండి"

♦ ♦ ♦

కాబోయే మామగారిని పిల్లనిమ్మని అడుగబోయి సంకోచంగా "మీ అమ్మాయి, నేను నాలుగయిదు సంవత్సరాలనుండి స్నేహితులము; యిప్పుడు నేను..."

"అయితే నీకేం కావాలి?....... ఉద్యోగమా"



# ఆహుతి



శ్రీ విజయ-రాఘవ

— x —

తపస్సమాధిలోవున్న మహామునులకు అనుకూలవర్తనంగా షట్పద, కోకిల, రాజకీర నివహంతో ఉన్మాదంకలిగించే మన్మథుడు, చెలికాడు వసంతుణ్ని మధుమాస మనోజ్ఞ మహోదయంలో వెంట తీసికొచ్చాడు. లేతృణాలతో లేమావిశరాలు తయారుచేస్తున్నాడు. మధుమాసంలో అనురాగ హృదయాలు విరహనిశ్వాస ధారలతో బాధపడుతోంది. గండు తుమ్మెదలు గందరగోళం చేస్తున్నాయి. నీలాకాశంవంకచూస్తూ మోదుగుపువ్వు మొగ్గలు నోళ్లువిప్పి నవ్వుతున్నాయి. చిరుచేమట గ్రమ్మ, నలసటకు చందనద్రవం కారుతోంది అభిసారికల వున్నత వక్షస్థలం మీద. మదనుని పుష్పచాప ప్రభావానికి గాఢమమకారానికి ఎదురుచూసుకునే హృదయాలు కలుసుకుంటున్నాయి. సుమధుర కుసుమామృతానికి అంజలిపడుతున్నయి ప్రేమజీవులు.

చలికొండశ్రేణులు చుట్టూ ఆవరించి వున్నాయి. సురపొన్న మోకలనీడనిల్చి, శార్దూల చర్మంమీద ప్రాణాయామపరుండైన ఆ మునీశ్వరుని పార్శ్వాన పుష్పాంజలిపట్టి సమయాసమయాలను పరీక్షిస్తూ పల్లవావతంస పార్వతి నిలబడివుంది. గాలితాకునకు జలతారు ధవళచీరచెరగు చనుగవమీద పమిటగా వుండలేనంటోంది. మాధవీలత లేచి గురులు తొడుగుతోంది. పార్వతి నునుమేను వసంతకాలపు మందమలయానిలు గిలిగింతలకు పులకరిస్తోంది. వస్తున్న సూర్యభగవానుని చూడటంతోనే వొళ్లు విరుచుకొని, విచ్చుతున్నయి మందాకిణి పద్మాలు. మునీశ్వరుని సపర్యలకు నియమించిన పార్వతి భయభక్తులతో మెలుగుతోంది. తన కరకమలాల్లోని కుసుమ బాలలు, కిలకిల నవ్వుతున్నారు బోసినోటితో. ప్రాతఃకాలపు అరుణకిరణాలకు పార్వతి బుగ్గలు మిలమిలలాడుతున్నాయి. కబరీభరంలోని మల్లెమాలలు భుజంమీదకు జారివున్నాయి.

తపస్సమాధిలోంచి మౌని మేల్కొన్నాడు. హిమగిరితనయి వులిక్కిపడింది. మౌని అర్ధనిమీలిత నేత్రాల్లోంచి శాంతి దృక్కులు ప్రసారితమౌతున్నయి. ఒయ్యారంతో ఒణికిపోయింది నడుము - వినయ సంభ్రమాలతో వంగిపోయింది పాదపూజకు.

నిర్మలోదకంతో స్వామి పాదాలు కడిగింది. ఆ నీటిని శిరస్సుపై చల్లుకొంది. ముమ్మారు భావిభర్తకు మొక్కుకుంది.

"సరిలేని మగని బడయుము తరుణీ-" అని దీవించాడు యతి.

పంచశరుడు బాణ విమోచన కాలం కోసం ప్రతీక్షిస్తున్నాడు. యీ సమాగమంకోసం - తాను చేయబోయే కార్యక్రమ ఫలితం - అనుభవించబోయే హృదయం పూరుకుంటుందో లేదో అనే శంకతో వింట నారి సారిస్తున్నాడు - దేవుని మీాద భారంవేసి.

ప్రేమ తొలకరించింది. మంద మందాకినీ పద్మమాల సమర్పించింది. పసనిపయ్యాద జారింది. చూచుకోలేకపోయింది త త్తర పాటులో. పూలందుకున్నాడు ముని; సమ్మోహనాస్త్రాన్ని సంధించాడు మరుడు. చంద్రోదయారంభానికి 'దుగ్ధసాగరం పొంగింది. గౌరి అర్ధ నిమీలిత నేత్రాల్లోకి, సరసప్రేమంపు చూపులు నిగిడ్చాడు యతీశ్వరుడు.

చూపుల్లోని భావాలు అర్థమయినాయి పార్వతికి. తనువుకి తెలియని పులకరింతలు అంకురించాయి. లజ్జతో మోము వాల్చింది.

ముని, పర్వతరాజకుమారిలోని సౌందర్యగరిమకు, యింద్రియక్షోభం కల్గిందని గ్రహించాడు. నాల్గుప్రక్కలు కలియ చూసాడు.

విరూపాక్షుని వింతనేత్రానికి ఆహుతయ్యాడు మారుడు.

జాలి కన్నీటిపాటలో. మేళవించింది కాళిదాసు కూజితాలు కరుణాత్మకంగా. రతి విలాపంవిని ప్రకృతి సానుభూతి చూపింది.

---

ఆమె "అదేమిటండీ! వాసాంలాంటి ముక్కు, నిక్కపొడుచుకొనియున్న చెవులతోటి ఆయన ఎక్కడ దొరికాడు మీా ఆఫీసులో క్యాషియర్ ఉద్యోగానికి"

ఆయన "పొరబడుతున్నావు. ఒక వేళ దగా చేసి పారిపోయినా సులభంగా మనిషిని గుర్తుపట్టి వెతికి పట్టుకోడానికి అనుకూలంగా అతనిని నియమించారు"

♦ ♦ ♦

"వాడు నన్ను గాడిద అన్నాడు"

"దానికింత గొడవ ఎందుకు"

"ఏమి చెయ్యమంటావు ?"

"దాన్ని రుజువు చెయ్యక పోయావా!"






## రా చ ఉ సి రి కా య ల జా మ్

అరినెల్లికాయలనే రాచవుసిరిక్కాయలనికూడా అంటాము. ఇవి పుల్లపుల్లగా వుంటాయి. వీటిని బాగా కడిగి, గింజ తప్ప కండనంతా తరిగి ఒక గాజుగ్లాసుతో కొలిచి వుంచుకోవాలి. ఈ కొలచివుంచిన దానిని ఒక కళాయి పాత్రలో వేసి, చిటికెడు వుప్పు, కొద్దిగా నీళ్లు చల్లి, పొయ్యిమీద పెట్టాలి. ఒక గ్లాసుడు వుసిరిక్కాయల పొట్టుకు, 2 గ్లాసుల చెక్కెర తీసుకొని, పాకంపట్టాలి. పాకంకాగానే, వుడికించిన వుసిరిక్కాయల ముద్దను అందులో వేసి కలియబెట్టుతోనే వుండాలి. ఆ ముద్ద రోజారంగుగామారి, గరిటెజారుగా తయారౌతుంది. అప్పుడే దానిని పొయ్యిమీదనుండి దించాలి. ఇది రొట్టెలలో పెట్టుకొని తినేందుకు ఎంతో రుచిగా వుంటుంది.

## దుం ప ల హ ల్వా

అర వీశె ఎర్రదుంపలు నీళ్లతో కొంచెము వుడికించాలి. మరీ ఎక్కువగా వుడికించరాదు. వీటిని రోటిలో వేసి బాగా దంచి వుంచుకోవాలి. 1 తవ్వ పంచదార పాకంపట్టి, అందులో 1 అళాను నెయ్యి పోసి, తరువాత ఈ దంచివుంచిన దుంపలపొడి, వేయించిన జీడిపప్పు, కొంచెము కుంకుమ పువ్వు, కాస్త ఏలకులపొడి వేసి, బాగా కలియబెట్టి కొంచెము సేపు నిప్పుల సెగనివుంచి దించెయ్యాలి. ఇదికూడా చాలా రుచిగావుంటుంది.

యం. సుశీల

---

# మరపురాని మచ్చుతునకలు

పవిత్రమైన సంసారాన్ని పాడుచేయ యత్నించినవాడే ద్రోహి.

బెర్నార్డ్ షా.

సేవకు నిర్మలమైనత్యాగానికి మూర్తీభవించిన విద్యాదేవియే స్త్రీ. ఎదుట వ్యక్తి, బాధను చూడగనే కరిగిపోయే హృదయం స్త్రీకి తప్ప మరెవ్వరికీలేదు.

గాంధీ.

ప్రకృతి సౌందర్యం యెక్కడైతే యుందో దానినంతను అనుభవించడమే కళాకారుల పరమావధి.

జంపన

ఆలోచనకు భాష దుస్తులవంటిది; శైలి రథమువంటిది.

శామ్యూల్ జాన్సన్.

ప్రపంచంలోయేదిగానీ పూర్తిగాదోషరహితంగాగానీ, నిష్కల్మషంగాగానీ లేదు.

శరత్ బాబు.

సేకరణ: మతుకుమల్లి వెంకటసుబ్బారావు.

# అజంట!

శ్రీ శ్రీనివాసరావు



"ఒరే కోటేశ్వర్రావ్! మన వెనక వస్తున్నారే వాళ్ళిద్దర్నీ చూడు చెప్తా!" అని నా ప్రక్కనే నడుస్తున్న నా మిత్రుడు నారాయణ నా చేయిఊపి అన్నాడు. నేను మా ప్రక్కగా వెళ్తున్న ఆ జంటను చూచి చూడనట్టు పరికించాను. మనమీ ప్రపంచంలో సామాన్యంగా చూస్తూంటాము- లావుపాటి యువకునికి నాజూకుగా, సన్నగా ఉండే అమ్మాయి భార్యగావటం! ఒడ్డూ పొడుగూ తగినట్లుగాఉన్న యువకునికి సర్కస్‌క్వీన్‌లా ఒక స్థూలకాయిని అర్ధాంగికావటం! చైనాముఖానికి ఊర్వసి లాంటి అమ్మాయి పెండ్లాముగావటం! స్ఫురద్రూపియైనవానికి ఏ కిష్కింధా గ్రహారిణి భార్యామణి కావటం!! అలా కాకుండా నాకీజంట ఎంతో ఆశ్చర్యం - ఉత్సాహం కూర్చింది. ఇద్దరూ సుందరీ నందులలా ఉన్నారు. ఉవ్వెత్తుగా దువ్వన్న ఉంగరాలజుట్టు, మన్మోహకమయిన ముఖము, లాల్చీ, బిళ్లగోచి పంచెకట్టు ఆంధ్ర - బెంగాలీ సమ్మిళిత సంస్కారం ఇట్టే కనుపిస్తుంది. అతనికి దగ్గఱగా - ప్రక్కనే నడుస్తున్న ఆ సుందరి సహజ సౌందర్యాన్ని ఆమె కట్టుకొన్న సన్నని నేతచీర, మోచేతివరకు చేతులున్న జాకెట్టు, ఆజానువిలంబిత వేణీభరము ప్రస్ఫుటితంగా ప్రకటిస్తున్నాయి.

"ఎవర్రా! వాళ్ళిద్దరూ! మనం చదివే ప్రబంధాల్లోని నాయికా నాయకులను మరిపిస్తున్నారు!" అని నేను మా నారాయణతో అన్నాను.

"భారతి, గృహలక్ష్మి, ఆంధ్రప్రభల్లో పడే బొమ్మల్ని చూచి తన్మయుడవు అవుతుంటావే! ఎంత అద్భుతంగా చిత్రించాడురా హృదయ్‌బాబు! అని వకాల్తా పుచ్చుకొని పొగడుతుంటావే! ఇతడే ఆ హృదయ్‌బాబు!!" అన్నాడు నారాయణ.

నా ఆశ్చర్యాని కంతులేకపోయింది. ఎంత దివ్యంగా చిత్రించుతాడు! ఒకటి రెండు రేఖల్లోనే ముఖంలోని అంతర్భూతంగాఉండే భావాలను విస్పష్టంగాచూపే ప్రతిభాశాలియైన చిత్రకారుడు హృదయ్

బాబు! ఇతడేనా! నమ్మలేకపోయాను. అతడి బుద్ధుడు, రాముడు, శంకరుడు చిత్రాల్లోని సౌందర్యమంతా ప్రత్యక్షంగా తానే పొంది ఉన్నాడే!

ఉత్సాహంతో అన్నాను - "ఆ అమ్మాయి అతడి ..."

"ఆc. అతడి ధర్మపత్నేరా!"

నా అఖండోత్సాహం పరిపూర్ణానందంగా మారింది. ఒక సౌందర్యవంతుడయిన కళాకారునికి అన్యాయంచేయకుండా తగిన భార్యను కూర్చినందుకు భగవానునికి ప్రణామాలెంచాను.

నా ఆలోచనను భంగం చేస్తూ, "కోటేశ్వర్రావ్! ఒక్క విశేషం! ఆయ నెప్పుడూ కండవాకప్పుకొనే ఉంటాడు. ఎందుకో తెలుసా!" అన్నాడు నారాయణ. వాడిప్రశ్న కొంటెగా - వెఱ్ఱిగా - తోచింది. వీడి బుద్ధి ఆనర్సు చదువుతూ బహుసూక్ష్మమవుతున్నట్లు తోస్తుంది.

"నాకు తెలియదుగాని నీవు మాత్రం ఒక ప్రహసనం అల్లకురా!"

"ఏం. నీ అభిమాన చిత్రకారునిపై ఏదో కామెంటు చేస్తున్నాననా, అలుక కలిగింది! పోనీలే!" ఒక చిరునవ్వు వాడి ముఖానికి అందం తెచ్చింది.

మాట్లాడకుండా నేను వాడిప్రక్కనే నడుస్తున్నా. చల్లనిగాలిలో, గంభీర సంద్రతరంగములు మా పాదాలకు దగ్గరగా తీరాన్ని పలుకరించి వెళుతున్నాయి.

ఉన్నట్లుండి వాడిలా అన్నాడు-"సహృదయంతోనే చెపుతా వినరా! హృదయ్ బాబు గొప్ప రూపసి అనీ, చిత్రకారుడనీ నేను ముమ్మాటికి ఒప్పుకొంటాను. కాని ఇప్పుడతనిపేరుతో వస్తున్న బొమ్మలు అతడి ప్రక్కనేఉన్న ఆ లతాంగే చిత్రించేది. కారణం-అతని కుడిచేయి లేదు!!"

విస్మయం నన్ను పెనవేసికొనిపోయింది. అదొక విచిత్రమయిన గాథలా అనిపించింది. మందహాసంతో నారాయణ యిలా చెప్పసాగాడు.

హృదయ్ బాబుది మాచీరాలే. అతడు చిన్నప్పటినుండి వీధిబడి, హైస్కూలు జీవితంలోనే చిత్రలేఖనంలో వయసుకు మించిన ప్రతిభాకౌశలాన్ని చూపిస్తుండేవాడు. పంతుళ్లు, మిత్రులు అంతా అతడి రమణీయ చిత్రాల్ని గంటల తరబడి చూస్తూ ప్రశంసిస్తుండేవారు. అతనితో పాటు అతని క్లాసుమేటుగా వస్తుంది మా ఊరి హెడ్మాష్టరుగారమ్మాయి రమ. మనోహరమయిన గుణవతి - రూపవతి, ఆమె హృదయ్ చిత్రాలంటే ముగ్ధురాలయ్యేది. హృదయ్ కూడా తన చిత్రాల్లో ఆమె ప్రతిబింబాల్నే చిత్రిస్తుండేవాడు. నిజానికి అతడి హృదయంలో ఆమె కెంతో చోటు ఏర్పడింది. అటు ఆమె స్థితి అలాగే

అయింది. సహృదయుడయిన హెడ్మాష్టరుగారు వారిద్దరి వినిర్మల స్నేహాన్ని చూచి మనఃపూర్వకంగా వారిద్దరికి ఉద్యోగమిచ్చేశాడు. గ్రామం అంతా ఆ జంటను ప్రేమతో దీవించింది.

నాలుగేళ్లు దొర్లిపోయినయి.

రమ చెల్లెలు, ఉమ హృదయ్ అంటే పడిచస్తుంది. ఎప్పుడూ హృదయ్‌ను బావా! బావా! అంటూ వెంట ఉండేది. ఆమెకిప్పుడు పదిహేనేళ్లు వచ్చినయి. పెద్దదైనప్పటికి తన ప్రియమైన బావను బావాయని నోరార పిలవటానికి జంకు — గొంకు లేదామెకు. హృదయ్ వేసే బొమ్మలన్నిటినీ రెప్పవాల్పకుండా చూస్తుండేది. తానూ బొమ్మలు గీయటం ప్రారంభించింది. ఆమె చిత్రకళా పిపాస, ప్రేమ ఆమెను ఆ కళలో సమర్థురాలను చేసినయి. తన చిత్రాలచేత హృదయ్ మెప్పును, శిక్షణను పొందింది.

ఒకసారి అది ప్రక్కింటివారి పెండ్లి సందర్భం. హృదయ్ అప్పుడు జ్వరంచేత మంచంలోనే ఉండిపోయాడు. పెండ్లిపనులతో రమ ఉమను బావకు మందు, సేవలు చూడమని చెప్పింది. ఇరవై నాలుగు గంటలు ఉమ హృదయ్ దగ్గరే కూర్చొని అతనికి సపర్యచేసింది.

తల దగ్గరగాకూర్చొని హృదయ్ ఉంగరాలజుట్టులో తన కోమలమయిన వ్రేళ్ళను జొనిపి నిమురుతూ, అమాయకంగా ప్రశ్నించింది. — "బావా! ఈ ఉంగరాల జుట్టు నీ కెలా వచ్చింది?"

హృదయ్ చిరునగవుతో, "నేను చెప్పను!" అన్నాడు.

"చెప్పవా బావా!"

మరి కొంచెముసేపు తర్వాత, "నీ కళ్లు చాలా అందమయినవి బావా! నీ ముక్కు, గడ్డము బొమ్మ వేయడానికి తగినయి బావా!" అని ఉమ అమాయకంగా అన్నది.

ఆమె అమాయకత్వానికి హృదయ్ ఎంతో మురిసిపోయాడు. బయట పెళ్లి మేళాలు వినపడ్డయి. అతడు మెల్లగా అన్నాడు — "నీవు పెళ్ళిప్పుడు చేసుకుంటావు ఉమా"

"పో, బావా!"

"లేదు ఉమా. నీకు, నీ బొమ్మలకు తగినవాడే దొరుకుతాడు!"

"ఉహుం. నేను పెళ్లిచేసుకోను. మా అక్కతో చెపుతానుండు!" అని ఆమె చెంగున క్రిందకు వెళ్లింది.

ఉమ కెక్కడో భర్త ఉన్నాడని ఊహించాడు హృదయ్!

ఇటు రమ సంగతి ఆమెకు తెలుసు — చెల్లెలు — ఉమ హృదయ్‌ను ఎంత

ప్రేమాభిమానాలతో చూస్తుందో, హృదయ్‌తో ఆమె అతిసన్నిహితంగా మెలగటం-పరిహాసాలాడటం రమలో ఏకల్లోలాన్ని రేకెత్తింపలేదు. స్ఫురద్రూపి, అందులో కళాకారుడు అయిన పురుషునిపై ఏ జవ్వని తన లేనవ్వులను చిలకరింపదు! తన పతిని అట్లా ఆకర్షించుతున్నపుడు ఏ సతి మౌనంగా ఉంటుంది! రమకు హృదయ్ మనసు బాగా తెలుసు-అతనిలో తానెంత లీనమయిపోయిందోనని

ఆ యేటి వసంతకాలములో రమా, ఉమా, హృదయ్‌లు నాగార్జున కొండకు పూర్వాంధ్రశిల్పులు చెక్కిన శిల్పాలు చూడ్డానికి వెళ్లారు. హృదయ్ ప్రమోదోత్సాహాలతో రమా ఉమలకు ఆ బౌద్ధారామాల శిల్పాలను చూపించి చరిత్రను వివరించాడు. నిర్జీవమయిన ఆ పాషాణాల్లో మానవమాత్రుడయిన శిల్పి భావుక హృదయాలను స్పందింపజేసే మానవరూపాలను మలచి జగత్ శిల్పితో బాంధవ్యము కూర్చుకొంటాడుగదా! అన్ని శిల్పాలు ఎవరికోసం చెక్కారో ఇల్లూ వాకిల్లూ లేకుండా యీసుదూర పర్వతగుహల్లో కేవల శిల్పంతోనే జీవించినట్లుంది ఆ శిల్పులు! ఈ భావాలతో ఆ ముగ్గురూ ఆ ప్రశాంత గంభీర ప్రకృతినిలయంలో విహరించారు.

రెండవరోజున మా చీరాలకు పిడుగులాంటివార్త వచ్చింది - రమా ఉమా హృదయ్‌లు ప్రయాణంచేస్తున్న కారుకు ప్రమాదం సంభవించిందని! హెడ్మాస్టరుగారు వికలహృదయంలో నాగార్జున కొండకుబయులుదేరారు. ఆ రాత్రి రమా ఉమా హృదయ్‌లు యింటికి తేబడ్డారు.

హృదయ్‌కు కుడిచేతికి పూర్తిగా బలమయిన గాయాలు తగిలి విరిగిపోయింది. రమకు ముఖంలో చాల గాజుపెంకులు గ్రుచ్చుకొనిపోయి, ఇంకా చాలా గాయాలు తగిలి మంచంలోనే ఉండిపోయింది. ఉమకు స్వల్పమయిన గాయాలయినందున త్వరలో స్వస్థకువచ్చింది. పూర్తిగా నుజ్జయిపోయినందున హృదయ్ కుడిచేయి ఆపరేషనుచేసి తీసివేశారు డాక్టర్లు. అటు రమ చావు బ్రతుకుల మధ్య ఉండిపోయింది. ఉమ వారిద్దరి మంచాలదగ్గరే అహోరాత్రాలు కనుమూయకుండా వారికి పరిచర్య చేస్తూండిపోయింది.

రమ వికలాంగుడయిన హృదయ్‌ను చూసికొని చాలా విలపించింది. ప్రతివాని హృదయాన్ని కదిలించే బొమ్మలనెన్నిటినో చిత్రించిన అతని కళాహస్తం - ఇప్పుడు లేదు. తన్ను బొమ్మగీయడానికి స్టూలుమీద కూర్చోబెట్టి - సరిగా ముఖాన్ని పెట్టలేక పోగా ఆ కళాహస్తం ఆమె గడ్డందగ్గరకు

వచ్చి కొద్దిగా అటు - ఇటు త్రిప్పి ఊపేది! ఎప్పుడూ తన చేతిని ప్రేమగా స్పృశించు తూండే ఆ ప్రేమపూరితహస్తం యిప్పుడు లేదు.

మొండిచేయి వాడయిన హృదయ్‌ను చూచి రమ గుండె కొట్టుకొనేది. ఆమె స్థితికూడా నీరసమయి పోయింది. ఇక యీ ప్రపంచంలో తన కెంతోకాలం చోటు లేదని గ్రహించింది. విచారవదనంతో, దుఃఖాకుల హృదయంతో పరిచర్యలు చేస్తున్న ఉమను దగ్గరకు పిలచి తన - వికలాంగుడయిన హృదయ్ బావను ప్రేమిస్తున్నావా అని అడిగింది.

ఉమ పిచ్చిగా రమ కేసి చూసింది. ఆమె వినీలనయనాలు ధూసరితంగా ఉన్నాయి. ఆమె పరిస్థితి అర్థంచేసికొని రమ "ఉమా! మీ బావను పెళ్లి చేసుకొంటావా!" అని అడిగింది.

ఉమ నేత్రాల్లో తృప్తి, మమత తొణికిసలాడినయి.

ఆ రాత్రి-కాలగర్భంలో ఎన్ని రాత్రులు లీనమయిపోయినవో. ఇంకెన్ని రాత్రులు లీనంకావల్సి ఉన్నవో! ఇలకోళ్లు, తీతుపిట్టలు అరుస్తున్నయి. ఉద్విగ్నంగా ఉన్న హృదయ్‌తో రమ యిలా అన్నది "బాబూజీ! నాకొక పెద్దకోర్కె ఉంది. తీరుస్తారా!"

భావోద్రేకంతో హృదయ్ రమవైపు చూసాడు-"చెప్పురమా! నీకేమి కావలిసినా సరే తప్పక తీరుస్తాను!"

"ఏమీలేదు. నేను బ్రతికే ఆశలేదు మీరు మీఅమాయక మఱదల్ని ఉమను వివాహం చేసికోండి. అది మిమ్మల్ని తప్ప ఎవర్ని పెళ్లాడదు!"

హృదయ్ హృదయం ఉల్లోలితమయింది. "ఏమిటి రమా! ఈ మాటలు!"

"ఏమీలేదు. మీరు నాయీ తుది కోర్కెను పూర్తిచేస్తామన్నారు. నాకేమీకొరతలేదు. ఉమను నన్నుచూసుకున్నట్లే చూడండి!"

రమ యీ పాడులోకాన్ని వదలి వెళ్లింది. హెడ్‌మాష్టరుగారు రమ తుది కోర్కెను మనఃపూర్వకంగా క్రియారూపంలో పెట్టాడు. ఉమాహృదయుల పెళ్లయింది. వారే యీ జంట! — అని మా నారాయణ ఆ విచిత్ర చిత్రకారుల కథను ముగించాడు. ఆకథనంలోంచి నా మనసు బయటపడింది. చీకట్లు మమ్మల్ని ద్దర్ని హాస్టలువైపు నడిపించినయి.




# స్త్రీల పాటలలోని దేశికథలు

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మ



స్త్రీ శూద్రాణాం వేదాధికారోనాస్తి అని విధి. బ్రహ్మదేవుని ముఖంలోంచి వేదం వచ్చింది. ఆగతం అనాగతం అయిన విషయాలు తెలుసుకోవడానికిన్నీ, సమస్త శాస్త్రాలకున్నూ ఆధారమయింది వేదమే. అయితే - అలాంటి వేదాధికారంలేనివారు తరణోపాయంలేక నశించవలసిందేనా ? అని ప్రశ్న. దీనికి సమాధానంగా అనేక మార్గాలు కనిపెట్టారు. పురాణాలూ, ప్రబంధాలూ, నాటకాలూ, తోలుబొమ్మలాటలూ, పాటలూ, హరికథలూ ఒకటేమిటి ఇలాగ అనేకం వీటన్నిటిలోనూ ఉన్నది ఆ వేదంలోని విజ్ఞానమే. చెరువుల్లో, నూతుల్లో, చెలమల్లో, ఏరుల్లో అన్నిటిలోనూ ఉండేనీరు వాన నీరే. క్రొత్తగా ఎవరూ పుట్టించిందికాదు. అలాగే స్త్రీల పాటలలోని విషయంకూడా సమస్త విజ్ఞానాలకూ మూల సంబంధమైన విజ్ఞానమే.

స్త్రీలు పనికిమాలినవారని ఎవరెలా అనుకున్నా - వారికుండే ప్రాధాన్యం త్రోసివేయడానికి వీల్లేదు. ప్రపంచకంలో సగంకంటె హెచ్చుజనసంఖ్య వారిదే. తల్లిగా పిల్లను పోషిస్తుంది స్త్రీ. భార్యగా భర్తను సంతోషపరస్తుంది స్త్రీ. మగవాళ్లు పాటలలో గొప్పవారయినా గానానికి తగిన కంఠం స్త్రీకే స్వాభావికంగాఉంది. అలాంటి స్త్రీల పాటలలో నీతిని ఉపదేశించే కథలూ, వ్రతమహాత్మ్యాలూ, ధర్మాలూ, ఎన్నో ఉన్నాయి. ఇందులో ఉండేకథలు రెండు విధాలు - సంస్కృత వాఙ్మయంలోంచి జారి ప్రవేశించినవీ - దేశీయంగాపుట్టి ప్రబలమైనవీని. కుశలాయకం, కుచ్చెలకథా, సీతాదేవి ఆనవాళ్లూ, కంససంహారం, కీచకవధా, ధర్మరాజు జూదం మొదలయినవి అనేకం ఉన్నాయి.

ఇక దేశీయమైనకథలు చాలా ప్రచారంలో ఉన్నాయి. దేశికథలంటే-సంస్కృత వాఙ్మయంలో ఆర్యనాగరకతా ప్రవాహంలో కొట్టుకువచ్చినవి కాకుండా తెలుగు దేశంలోకాని - ఇతరములయిన అరవ కన్నడ దేశాలలోకాని స్వతంత్రంగా బయలుదేరిన కథలు. ఇవి రెండు రకాలు—కేవలం ఇతివృత్తం—పేర్లూ అన్నీ దేశీయంగానే ఉన్నవి మొదటి రకం. రెండవ రకం ఎలాంటివంటే - సంస్కృత పురాణాలలో లేకుండా దేశీయంగా కల్పించి పురాణాలలో కెక్కినవి. ఈ రెండు రకాల కథలూ ప్రచారంలో ఉన్నాయి. కథ ఏదయినా, కావ్య మెలాంటిదయినా కల్పన దేనిమీద ఆధారపడిఉన్నా బాదంకాయలోని పలుకులాగ ఒక ప్రధానమైన అభిప్రాయం ఉంటుంది. కాళహస్తి మాహాత్మ్యం చూడండి - అందులో కథలెన్నో ఉన్నాయి. కథలన్నీ అలాగే జరిగాయని అంటారా? వీటన్నిటిలోనూగల కీలకం వకటే. శివుడు పరదేవత అని

చెప్పడం. ఇలాగే - వైదేశికథల్లో కొన్నిటిలో ప్రధానోద్దేశ మొకటి ఉంటుంది. తులసిపాట చూడండి - అది దేశికథే అనీ - నేచెప్పిన రెండో తరగతిలో చేరుతుందనీ నా ఊహ. తులసి గొప్ప దని చెప్పడమేకదా ఈ పాటలోని ముఖ్యోద్దేశం! ఇవన్నీ కవి కల్పితాలంటే - విమర్శకులంగీకరిస్తారు; భక్తిపరులు గర్జిస్తారు. అలాగే శ్రావణ మంగళ వారాల నోముల కథలూ, సావిత్రీ గౌరిదేవి నోము కథా ఇవన్నీ దేశీయాలే. కాదని ఎవరన్నా అన వచ్చుకాని - ఏ వేదంలోనో, ఏ ప్రాచీన పురాణాల లోనో ఆధారాలు చూపించిననాడు - కాదు - కాదు అని చెంపలేసుకుంటాం.

మరిన్నీ - శివభక్తి ప్రతిపాదకాలయిన కథలు పాటల కెక్కినవి - చాలా వరకు దేశీయాలే. మరో విశేషమేమిటంటే - దేశీయంగాపుట్టి ప్రచారంలోఉన్న బసవ పురాణంలోని కథలవంటికథల్ని కొంత సంస్కరించినీ, సంస్కృతీకరించినీ తమ వదనశంఖాలలో నుండి వినిర్గమింపజేసి తీర్థం అన్నారు. అయితే - వాటి దేశీయ స్వభావం ఎక్కడికిపోతుంది! ఇవన్నీ రెండవ రకంలోనికి చేరినకథలు.

మొదటి రకంలోనికి చేరినవని నేచెప్పినకథలు చాలా ఉన్నాయి. దేశింగురాజుకథ, పల్నాటి పౌరుషం, బొబ్బిలికథ, కామమ్మకథ, పేదరాశి పెద్దమ్మకథ, బాలనాగమ్మకథ, పాముకథ, కుమ్మరి గుండాయకథ, గుమ్మడికథ, పతివ్రతలకథలు ఇలాంటి వెన్నో ఉన్నాయి. అవన్నీ చెప్పమంటే - నాకూ సాధ్యంకాదు. ఎంచేత నంటారేమో - ఓ రామాయణమో - భారతమో అంటే - అచ్చు పుస్తకాలు దొరుకుతాయి. వాటిని పండితులుచదివి ఆదరిస్తారు. వాటికి విలువాఉంది. వాటిని గురించి ఏమయినా చెప్పనూవచ్చు. అవునంటే - కాదని ప్రమాణాలతో స్థాపింపనూవచ్చు. క్రొత్తంచులతో చిత్ర విచిత్రాలుగావచ్చిన ఎనభై నెంబరూ, నూరు నెంబరూ రంగుల నూలు చీరలు బాగా వాడుకలోఉన్న ఈ రోజులలో పాతకలంకారీ అద్దకంతో ఎక్కడో - మారుమూల పల్లెటూరు మగ్గాలలోనేసిన వింత ముతుక చీరలు (నేటి ఖద్దరు చీరలుకావు సుమండీ!) వెతకి తెమ్మంటే - బ్రహ్మాండమైన పరిశ్రమచేయాలి. అలాగే ఈ స్త్రీల పాటలలోని దేశికథలుకూడా. అసలీ రోజులలోని సినీమా పాటలముందు త్యాగరాజు కీర్తనలకే త్యాగం ఏర్పడుతూఉంటే - ముసలమ్మలు పాడేపాటలు వినేవారెవరు? నేర్చుకునేవారెవరు? పైగా - అలాంటి పాటలు కొన్ని తెలిస్తేకూడా - అందులో కొన్ని కథలులేని పాటలూ, కొన్ని సంస్కృత కథలతోకూడిన పాటలూ అయిపోతాయి. కాగా - దేశికథలు పాటలు తక్కువ.

వీటన్నిటినీ సంగ్రహించి నిలవబెట్టాలంటే కొండ త్రవ్వి ఎలుకనుపట్టినట్టే. ఆలోచిస్తే - భారతీయ నాగరికతా ఆనే మృగరాజానికే ఈ నాటి నాగరక భవనాల్లోంచి బహిర్గతమై ప్రాచీన గ్రంథాటవులలో దాగుండవలసిన అవస్థపడితే - ఈ తెలుగు ఎలకను పట్టడానికి కొండల్ని పిండికొట్టే నిండుగుండె ఎక్కడినుండివస్తుంది! సరేలెండి - అవివస్తే వస్తాయి; లేకపోతేలేదు. నాకు తెలిసినంతవరకు వాటి స్వభావాన్ని గురించి రెండు మాటలుచెప్పి ముగిస్తాను.

ఈ కథల్లో ముఖ్యమైన విషయం - ఏదో వకటి కీలకంగా ఉంటుందని ముందే చెప్పాను. అయితే - ఒక నీతో - ఒక ధర్మమో ఉపదేశించడం ఉద్దేశం. కాబట్టి - స్త్రీలకు ముఖ్యమైన పాతివ్రత్యం, దైవ చింతా, దానఫలం, సంతానప్రాప్తి, అత్తమామల సేవ, కోడళ్ల బాధ, మగల దయలేమి, స్త్రీల స్థిర చిత్తతా, ఉపవాసాల ఫలితం, నోముల గొప్పతనం ఇలాంటివన్నీ ఉంటాయి. ఇంతేకాదు - వాటిని చెప్పడంలోకూడా ఒక విశేషంఉంది. ప్రౌఢ ప్రబంధాలలోని చంద్రచందన రోలంబాదులూ, కవి సమయాలవల్లవచ్చిన ఉపమానాద్యలంకారాలూ, కవి నిబద్ధవక్తృ ప్రౌఢోక్తులూ ఉండకుండా, చిన్న చిన్న ఉపమానాలూ, యథాలాపముగావచ్చిన సామెతలూ అందులో ఉంటాయి. ఈ క్రింది ఉదాహరణలు వినండి —

" ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ...
నీలంపు తలకుంచ కలిగుండుగాని,
పచ్చిపసుపలదకే అలదినట్లుండూ,
బంగారుమొగచాయకలదె మా కాంతా,
పెట్టకను కాటుకపెట్టినట్లుండు,
దిద్దక తిలకమ్ము దిద్దినట్లుండు,
చేయక శృంగారము చేసినట్లుండు,
అలదక పరిమళం బలదినట్లుండు,
వేయక తాంబూలమ్ము వేసినట్లుండు,
పగడంపు ఒకచాయ కలిగుండుకాంతా,
తొడుగులు తొడగకే తొడిగినట్లుండు,
తొలకరి మెరుపువలె తావెలుగుచుండు,
మసిపాతగట్టిన మాణిక్యమ్మువలెను.
... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ...
శీతకాలమునాటి ఉదకమ్మువలెను,
మేఘమ్ములోనున్న సూర్యునివలెను.''

''మందు తింటున్నానురా
ఓరోరి మగడా !
మందు తింటున్నానురా ॥
మందు తింటున్నాను మగడా !
ముందుగా నీ కెరుక చేసితి
సందుచేసుక వస్తివేమో
సాగవు నీ బాసలిప్పుడు ॥ మం ॥
ఉరగదంచిన పాతబియ్యము
అర్థశేరు వండుకొని
అరిసిముక్కా గారెముక్కా
అంచున నెయ్యద్దుకొని ॥ మం ॥
అర్థశేరు ఆవునెయ్యి
పావుశేరు పంచదార
నీరు కలవని ఆవుపాలు
నిమ్మకాయ ఊరగాయ ॥ మం ॥
... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ...
పండుపండిన జామిపండ్లు
పండిన దానిమ్మపండు
ఎండి ఎండని ద్రాక్షరసముతో
ఖండ శర్కర వుండచేసుక ॥ మం ॥
కొర్రకూడు వండినాను
కోడిచారు కాచినాను
కాక రోగంచేత
బాధపడుతున్నాను మగడా ! ॥ మం ॥

" ... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ...
ఈ రూపు రేఖ ఈ చక్కదనము
ఎందుండి ఈ యూరికే తెస్తివమ్మ !
... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ...
కాక యినుముకు ఈగముసురునా చెప్పుమా!
నిప్పు చెదలంటునా నీవు యెరుగవా
సముద్రము కడముట్ట ఈదునా యెవడు ?
... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ...

తిరుముత్య గజముల తీరుగలవాడు

... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ...

కుందనపు బొమ్మవలె కాంతలున్నారు
పొగడ బొమ్మలవలె పడతులున్నారు.

... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ...

" ... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ...

మానుపారి తీగమాను దప్పిన
వెనుకమరి యెట్లు నిలువగలదు,
చమురులేనిదివ్వె యెంతకాలము
రామ! వెలిగేదియని పలికె "

ఇలాంటి వింకా ఎన్నో ఉన్నాయి. ఇందులో భాషకూడా వ్యావహారికంగా తెలుగులో ఉంటుంది. దీర్ఘ సంస్కృత సమాసాలు మచ్చుకైనా వుండవు. చుట్టుకైదువుజోదు, సోకుమూకలగొంగ, మంచి కొరలరేడు మొదలయిన కృతకపదములు అచ్చతెనుగు పేరులతో రావు. ఈ క్రింది ఉదాహరణలు వినండి. ఏమాట కామాట విడబడే ఉంటుంది —

"బాలుడనదగునా !
యశోదమ్మ ! నీ తనయుడు ! "
"పోదముపదరే కృష్ణుని వెదుక
ఓ చెలులారా !
పోదాము పదరమ్మ !
మోదమలరగ వాడేదారి వెడలెనో
ఇకనేమి సేయుదము ... ... "
"అరటాకు వంటిది
ఆడజన్మంబు ... ... "
"ఉయ్యాలలో జంపాలలో
శివశివ ఉయ్యాలలో జంపాలలో ... "
"రత్నాల చవికెలో
ముత్యాల గద్దెపై ముక్తికాంతవు
రెండు కుండల నడుమ
కంటిపాపలలోన మిన్నంటిచూడవలె."

కాగా-వ్యాకరణం వప్పుకున్న గ్రాంధిక రూపాలే ఉండాలన్న నియమంలేదు. ఇక చందస్సు సామాన్యంగా ద్విపదా, మంజరీ మొదలయిన మాత్రా చందస్సులే కాని - మరోచందస్సు అవుపించదు.

(విజయవాడ ఆలిండియా రేడియోవారి సౌజన్యముతో)

# మాతృహృదయ ప్రశంస

శ్రీ వాకాటి పెంచలరెడ్డి

'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అనునట్లు జనని, జన్మభూమి యనునవి స్వర్గతుల్యములు; ఆరాధ్యములు. మనువు మాతృస్వరూపిణియగు స్త్రీకి ఎట్టి విలువనొసంగెనో తిలకింపుడు.

'ఉపాధ్యాయునకంటె పదిరెట్లు ఎక్కువ గౌరవార్హుడు ఆచార్యుడు. ఆచార్యునకంటె నూరురెట్లు గౌరవార్హుడు తండ్రి. తండ్రికంటె వేయిరెట్లు ఎక్కువ గౌరవమునకు నర్హురాలు తల్లి.'

'తాస్మాత్తాః ధ్వ్యాః స్త్రియః పూజాః సతతం దేవవన్నరైః, సతీనాంతు ప్రసాదేన ధార్యతేవై జగత్రయమ్' అని మత్స్యపురాణములో జెప్పబడినట్లు సాధ్వులగు స్త్రీలు సతతము దేవతలవలె పూజ్యురాండ్రు. సతుల ప్రసాదము చేతనే త్రిలోకములు నిలిచి యున్నవి.

ప్రాచీనుల అనుభవోక్తులగు సామెతలును మాతృదేవికి అగ్రతాంబూలము నొసగుచున్నవి. చూడుడు :-

'తల్లి దైవము, తండ్రిధనము'

'తల్లిని చూచి పిల్లను, పాడిని చూచి బఱ్ఱెను తీసికొనవలెను'

'తల్లిలేని పిల్ల, వుల్లిలేనికూర'

మాతృహృదయము "మాతృహృదయము" అనుకావ్యమున శ్రీమతి దొప్పలపూడి అనసూయాదేవిగారు యథాతథముగ వర్ణించిరి. ఇయ్యది యీమె ప్రథమకావ్యము. "అభినవ తిక్కన" బిరుదాంకితులగు శ్రీతుమ్మలపల్లి సీతారామమూర్తి కవిగారి కనకాభిషేక మహోత్సవసందర్భమున, అనసూయాదేవిగారు అన్నయగు కవిగారికి భక్తి పురస్సరముగా నీకావ్యము నర్పణ మొనర్చెను. తన కావ్యకన్య మూలమున శ్రీసీతారామమూర్తి కవిగారివంటి వారిని అల్లునిగఁ జేకొనిన ఈమె పూర్వజన్మ సుకృతము వర్ణనాతీతము. నేటికాలపుటల్లుండ్రవలె నీయల్లుడు కట్నకన్యను వరింపక, సత్కావ్యకన్యను వరించి తృప్తిఁజెందెను. ఆనందము ననుభవించెను.

ఈ కావ్యమునందు అంకురార్పణము, కాన్పు, అంతర్వాణి, పరిచయము, పాలు, దీపజ్యోతి, స్పర్శ, ఊయల, రంగులు, ఉగ్గు, రోదనము, లాల, జోల, జబ్బు, పాకీపని, నవ్వు అనువానిని గూర్చి హృద

యంగముగ శ్రీ అనసూయా దేవిగారు వర్ణించి యున్నారు.

జాను తెనుఁగు నుడికారంపు సొంపు చెడకుండ ఈ కావ్యమందు కవిత ఆద్యంతము అలరారుచున్నది. ఎన్ని పర్యాయములు పఠించినను, పదేపదే పఠింపవలెననియెడి ఆకాంక్షమదియందు పొడగట్టును. 'తేనె సోక నోరు తీయని యగు రీతి' అనునట్లు ఈమె కవనము ద్రాక్షాపాకమున తనరారుచున్నది. ఇంకను ఇట్టి గ్రంథములను వ్రాయ రమాపతి ఈమెకు ఆయురారోగ్యైశ్వర్యముల ప్రసాదించుగాత. భాషాభిమానులెల్లరు ఈ కావ్యమును పఠింపఁగోరుదును. స్త్రీలు తప్పక ఈ గ్రంథమును చదివి నారీలోకమున కుపకరించు గ్రంథములను వ్రాయగోరుదును. "ఆంధ్రకవయిత్రులు" అను గ్రంథములో శ్రీమతి ఊటుకూరు లక్ష్మీకాంతమ్మగారు అనసూయా దేవిగారి జీవితమును వ్రాసి యున్నారు.

"ఆంధ్రకవయిత్రులు" అనురచనము ద్వారా దాదాపు రెండువందలమంది తెలుగుకవయిత్రుల జీవితచరిత్రములను మనకు పరిచయముచేసిన శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారికి భాషాభిమానులెల్లరు కృతజ్ఞతాపూర్వక జోహారులనర్పింపవలసి యున్నది. గర్భవతియైనది మొదలు, జన్మింపంబోవు శిశువునందనురాగము జనించుట; జననానంతరము బిడ్డను ప్రేమతో లాలించుట; ఊయలలో బిడ్డను బరుండఁబెట్టి, జోలపాడుచు నవాజానస చరానందమును బొందుట; బిడ్డకు జబ్బు చేసినప్పుడెంతయో బెంగఁ జెంది, భగవంతునకు మ్రొక్కుట; సాధారణముగ మూత్రపురీషాదులను గాంచినంతనే యసహ్యాభావము గలిగినవారు, మాతృదేవతలైనంతనే, సహ్యాభావమును వహించి, పాకీవానివలె చరించుట మున్నగు విషయములనతి హృద్యముముగ శ్రీమతి అనసూయాదేవిగారు తమ కావ్యమున వర్ణించి యున్నారు.

ఆయా ఘట్టములలోని కతిపయ పద్యముల నిటఁ బొందుపఱచుటెంతయు సమంజసమని భావింతును.

అలసిపోయితి నంతలోఁ గలఁత దీఱ
క్యారు క్యారని గుండెలో మాఱుమ్రోఁగ
విస్మరించితిఁ బొందిన వేదనంబు
నవతరించిన నవ్య భాగ్యమ్మువలన.

పరిఁచితుఁడైన వాఁడు పసిపాపలలో నివసించువాఁడు నేమఱక చరాచరంబులే సమంబుగఁబోషణ చేయు వాఁడు ము
న్నరయని వారమాట నెఱుకయ్యెడు దాఁకక్షణంబు వీడకే
సరస వసించి నేర్పునొకో సంజ్ఞలతో వెలిపుచ్చు భావ్యముల్.

గుప్పున జప్పరించుచును గ్రోలఁగ వీలగు పాత్రలందు నీ
కప్పటి కప్పుడే పచనమై ప్రవహించును వెచ్చ వెచ్చగా
నిప్పను నీళ్ళులేక యిట నిల్చెడి నెన్మిదిజాములందు నీ
కెప్పటి కాఁక తానో యపుడెల్ల ననుఁగడు తొందరించుచున్.

ఎవ్వారి చెంతనుండినను — నేనటకేగుట గాంచినంతనే
చివ్వున ముందు కొగ్గి తన చేతులనిచ్చుచు నెత్తుకోకనే
నవ్వాలి కేగినన్ మిగుల నారటమందుచు నేడ్చు బిడ్డనిన్
దివ్వునఁ జేరి తీసికొన రేఁగెడు ప్రేమ వచింప శక్యమే.

నవ్వుకొనుచును దొట్టిలోఁ బవ్వళించి
హాయిగా నూఁగుచున్న పాపాయిఁ జూచి
కొనుచునుండిన కొలఁది నామనము పొంగు
నున్నతోన్నతపథ మందుకొన్నయట్లు.

చిట్టి దెబ్బల లక్ష్య పెట్టకుంటివి నిన్నుఁ
బెద్దగాఁ గొట్టి యేడ్పించు టెట్లు
నామోము వీక్షించి నవ్వుచున్నట్టి నిన్
గోటితోఁ బలుమాఱు కొట్టు టెట్లు
కనులతోఁగొట్ట వద్దనుచుండఁగా గుండె
కరఁగుచున్నది కొట్టఁగల్గు టెట్లు
పోయకుండిన నేమి చేయునోయని భీతి
వేయుచున్నది మాని వేయు టెట్లు

గుటక వేయవు తండ్రి! నిన్ గొట్టకున్న
పొంగు చుంటివి నీ పొంగు భంగ పెట్ట
నొప్పకున్నది చిత్తమ్ము తప్పదయ్యెఁ
దొందరించుచునుండెరా ముందు పనులు.

తిన్నగాఁగాళ్ల పైఁ బన్నుండఁ జేసి నా
చిన్నారి మేనికి వెన్న పులిమి
పరిమళ ద్రవ్యముల్ పసపును జేరిచి
విసరిన మెత్తని పెసరసున్ని
తోడ నలుగు పెట్టఁదొడఁగ మానసమందుఁ
గందు చుండెనో పసికందు గాత్ర

మనుభయం బొదవఁగా నల్ల నల్లన రుద్ది
వేసి మస్తకమున బూసినట్టి

తైల మంతయు వెడలించి త్వరితగతిని
జలకమాడించి మెత్తని వలువతోడఁ
దుడిచి కురులను ధూపమ్ముతోడ నార్చి
యూయలను జేర్ప నిద్రించు హాయితోడ.

అతివలు గాన విద్యఁగను టక్కు అయన్న తలంపుగల్గినా
మతిని; సుతుండు జోలకడు మక్కువతో వినుచుంట
గాంచినన్
గతి నొకయింత నేర్వకయె కంజదళాక్షులు పాడఁగా
వినన్
హితమగు; గాత్రమార్దవము నిందులకే ప్రభుఁడిచ్చె
వీరికిన్.

దండము సత్ప్రభూ! యిఁకను దప్పుదు తిండ్లను
మానివైతు నీ
గండముగావుమయ్య మదిఁగల్గు విచారములాఁపరానివై
యుండెను నీవుగాక యొరులుండిరె వేడఁగ దేవదేవ! నీ
యండకుఁ జేరితిన్ హృదయమందు వసించుచు
నాదరింపవే

నవ్వు చూడఁగానె నవ్వురాకుండునా
యొక్కసారియైన, నుల్లమందు
మోసమింతలేని బోసిపాపని నవ్వు
భాసిలంగఁ జేయు భావతతిని.

---

ఇంటితలుపు తాళం వేసుకొనిపోయి ఆలస్యంగా వచ్చిన భార్యతో "ఇంత ఆలస్యంగావచ్చి నన్నిలా బజారులో గాడిద లాగ నిలబెట్టడంలో నీ ఉద్దేశం ఏమిటి" అని గద్దించి అడిగాడు.

"అది నా తప్పా? మిమ్ముల నలాగ ఎవ్వరు నిలబడమన్నారు" అన్నది భార్య.

♦ ♦ ♦

యజమాని:—నే చెప్పినపనల్లా చేతులు కట్టుకొని చెయ్యి!

పనివాడు:—చేతులుకట్టుకు యెలా చెయ్యాడమండీ?

---




# లోభి

సి. హెచ్. శ్రీరామమూర్తి

వరహాలుశెట్టి కొబ్బరివర్తకుడు. ఊళ్లో టోకున కొబ్బరికాయలు కొని తన స్వంతఒంటెద్దు బండిమీద కొన్ని ఒలిచిన కొబ్బరికాయలు వేసుకొని స్వయంగా బండి తోలుకొని వెళ్లి ప్రక్క ఊళ్లల్లో సంతల్లో చిల్లరగా లాభానికమ్మేవాడు. ఒల్చిన డొక్కకూడ ఖరీదుకమ్మేవాడు. ఇలా అతను వర్తకంలో చాల లాభం గడించాడు. కాని వట్టి పిసినిగొట్టు. ''పిల్లికైన బిచ్చంపెట్ట''డంటారే అలాంటి వాడన్నమాట!

ఒకసారి తన పదేళ్ల కొడుకుని అలవాటవుతుందని ప్రక్క ఊరి సంతకు తీసుకొని వెళ్తున్నాడు. అదిమండు వేసవి కాలము. కొంతదూరం వెళ్లేటప్పటికా కుఱ్ఱాడికి దాహం వేసింది. చుట్టుప్రక్కల నుయ్యికాని, యిల్లుకాని లేకపోవటం చేత ఒక కొబ్బరికాయ కొట్టుకుని త్రాగుతానని తండ్రినడిగాడు. కాని శెట్టి, కొబ్బరికాయపోతే పావలా పోతుందని లోభంతో ''అదిగో ఆ ముందరేవుంది బ్రాహ్మలిల్లు అక్కడ మంచినీళ్లు త్రాగుదువుగాని కొంచెం ఓపికపట్టు''అని యెద్దును జోరుగా తోలడం మొదలెట్టాడు.

కాని యెంతదూరం వెళ్లినాయిల్లూ లేదు-ఏమీ లేదు. పాపమాకుఱ్ఱాడు ఎండగాడ్పు వల్ల దాహాని కాగలేక కొబ్బరికాయ కొట్టుకొని త్రాగుతాననడం, పిసినారిశెట్టి అదుగో యిదుగోయిల్లువస్తోందని, లేకపోతే నుయ్యివస్తోందనీ జరపడం జరుగుతోంది. కొంతసేపటికి వాడు ఎండగాడ్పుకి దాహం చేత బండిలోనే సొమ్మసిల్లి పోయాడు.

శెట్టి తన కొడుకు నిద్రపోయాడుకదా అనుకున్నాడు. ఆఖరుకి సంత ఊరువెళ్లిన తర్వాత ఒకల్లింటికెళ్లి మంచినీళ్లు తెచ్చి కొడుకుని త్రాగమన్నాడు కాని వాడికి నీళ్లెందుకు ? పాపం ఆచిన్నవాని ప్రాణములు దారిలోనే గాలిలో కలిసిపోయాయి!

ఆ సంగతి శెట్టికి తెలియక కొబ్బరికాయ నీళ్ల కోసం కొడుకు అలిగాడనుకుని

విసుక్కుంటూ, నష్టంవస్తుందని బాధ పడుతూ, కుర్రాడిని తిట్టుకుంటూ ఒక కొబ్బరి కాయకొట్టి ఆ నీళ్లు వాడి నోట్లో పోసాడు. కాని మ్రింగడానికి వాడుబ్రతికుంటేగా!

అప్పుడు శెట్టి అసలు సంగతి తెలిసికొని ఏడుస్తూ కొబ్బరికాయలు ఒక్కొక్కటే కొట్టి "అన్ని కొబ్బరికాయల నీళ్లు అయ్యాగా నువ్వేత్రాగు" అని వాడినోట్లో పోస్తుంటే చుట్టూ చేరిన వాళ్లు విషయం తెలిసికొని "చేతులు కాలాక ఆకులుపట్టుకుంటే లాభమేమిటని" చెప్పి అంతా వెళ్లి పోయారు.

పాపం! లోభత్వంచేత శెట్టి తన కొడుకుని పోగొట్టుకున్నాడు. బాలలూ! మీరెప్పుడూ పిసినిగొట్టులనిపించుకోకండేం!

---

# ప్రత్తి పనులు

ప్రత్తిని దెచ్చి పక్కాలు ఏరి
చేరు ముల్లుంతో చెత్తను గూసి
నిడుపు రాట్నమున వడిగా నిడిచి
గింజలు తీసిన పింజ దూదిని
ఏకు బద్దతో ఏకి – ఊచతో
ఏకును చుట్టు – ఏకులు పట్టి
వడుకు రాట్నమున కదురును త్రిప్పి
బాగా పురిగల దారము దీసి
తీసిన దారము బట్టలు నేసి
నేసిన బట్టలు కట్టాలి!
బట్టలు కరువు తీరాలి.

# ఏకు

ఏకండి దూదిని
ఏకి ఏకులు చుట్టి
ఏలండి లోకాలు
ఏలండి మీరు
ఏకుచే లోకాన
ఏర్పడును వస్త్రాలు
వస్త్రమే మానవుని
ఒడలు పోషిస్తుంది
వస్త్రాలు లేకుంటె
వసుధలో సిగ్గు.

# తకిలీ

తకిలీని గిర గిర త్రిప్పి
దారమును బిరబిర దీసి
ఆనందపు గీతము బాడి
ఆడుకొందాము రారె
ఆటలలో దారం ఆట
ఆనందమైన ఆట.
దారమును ఎక్కువ దీసి
మీరండీ! దారపు పందెం!

# రాట్నము

వేవేగ తిరగవే రాట్నమా! – నీ
వేగమే మాదేశ సౌభాగ్యము.
కదురుపై నిలిచేటి
కడు పొడవు దారమును
త్రుంచి వేయక పురిని
పెంచి కాపాడవే ॥వే॥
తీరుబడి సమయాన
చేరెదను నీ చెంత
దారమును తీసెదను
దారిద్ర్యమును బాపు ॥వే॥

శ్రీ పోలాకి శ్రీనివాసరావు

## వీరబల్ వినోదాలు

అక్బరు పాదూషా ఒకనాడు వీరబల్‌ని పిలచి "వీరబల్! నాకు చాలా తలనొప్పిగా వుంది; అదిపోవాలంటే వైద్యులు ఎద్దు పాలు త్రాగమన్నారు!! అని తీసుకురా!!!" అన్నాడు.

వీరబల్ యీసారి చిక్కులోనే పడ్డాడు. ఏమి చెయ్యడానికీ పాలుపోలేదు. దూరం ఆలోచించేడు. వీరబల్ తన భార్యనిపిలచి ఏదో చెవులో చెప్పేడు. సరే నందామె.

రాత్రి ఒంటి గంట అయింది. వీరబల్ భార్య అక్బరు పాదూషా భవనంముందు బట్టలువుతకడం ప్రారంభించింది.

అక్బరు బైటకు వచ్చి 'ఇప్పుడెందుకు వుతుకుతున్నావు బట్టలు?' అని ప్రశ్నించేరు.

'ఏంలేదండీ!మా ఆయన ప్రసవించాడు!' అంది.

'పురుషులు యెక్కడైనా పిల్లల్ని కంటారా!!' అన్నాడు పరిహాసంగా.

'ఎద్దు పాలిస్తుందా ప్రభూ!' అన్నదామె. అక్బరు సిగ్గుతో తలవంచుకొని లోనికి వెళ్ళి పోయాడు.

అక్బరు వీరబల్‌ని తిరిగి ఎప్పుడూ ఎద్దు పాలుగురించి ప్రశ్నించలేదు.



గోపాలపురం మద్రాసు సంగీత కళాశాల 8 వ వార్షికోత్సవ సందర్భమున తీసిన ఛాయా చిత్రము

# అమాయకురాలు

ఒకప్పుడు ఒక గ్రామంలో ఒక అత్త, కోడలు వుండేవారు. అత్తగారిపేరు రంగమ్మ, కోడలిపేరు మంగమ్మ. మంగమ్మ ఉత్త అమాయకురాలు. మంగమ్మని నానాహింసలు పెడ్తూవుండేది రంగమ్మ. మంగమ్మ భర్త చూస్తూన్నా తల్లి కెదురు చెప్పలేకపోయాడు. మంగమ్మ అత్తగారి బాధలుపడుతూ కాలం గడుపుతోంది.

రంగమ్మకి ఒకసారి జబ్బుచేసింది. ఏం చేసినా లాభంలేకపోయింది. కాకపోగా జబ్బు మరింత ముదిరింది. రంగమ్మకి తన ప్రాణంమీద పూర్తిగా నమ్మకంపోయింది. తాను మరణించిన తర్వాత మంగమ్మ సుఖపడుతుందనే బాధతో చచ్చిపోయేముందు మంగమ్మనిపిలిచి 'ఒసే! మంగమ్మా! నేను చచ్చేనుకదా అని పంచభక్ష్యపరమాన్నాలు వండుకుతినేవు! ఇవిగో నా కళ్లుతీసి గూట్లో పెడుతున్నాను. గంజీ అన్నంతప్ప మరేమన్నా తిన్నావా నేను చూస్తూనే వుంటాను' అంటూ వంటయింటిగూట్లో రెండు కంటిగుడ్లు పెట్టింది.

మంగమ్మ గంజి అన్నం తింటూవుండగా భర్త ఒకనాడుచూచి అడిగేడు కారణం ఏమిటని. మంగమ్మ జరిగిన సంగతి అంతా చెప్పేసరికి భార్య అమాయకత్వానికి నవ్వుకున్నాడు. అవి రెండూతీసి అవతల పారేసి అవి గాజు గుడ్లని చెప్పాడు.

బాలలూ!

పూర్వం రోజుల్లో కోడళ్లు ఎంత అమాయకులో చూశారా! 'ఇప్పుడో! అత్తను మించిన కోడళ్లు!!

పిల్లా సుబ్బారావ్ శాస్త్రి

# ఉగాది పిలుపు

కవిచంద్రులు కోట సోదరకవులు

మచ్చికనాదరించు యజమాని దివంగతుఁడయ్యె నంచు లో
వెచ్చగ నూర్చుకుండ సరవిన్ శుభనూతన వత్సరాన నీ
యచ్చట ముచ్చటల్ కనెడు నాంధ్ర వధూమణు లుల్లసిల్లఁగా
వచ్చుచుఁబోవుచుండు మలవాటుగ; నీకొక లోపమున్నదా! –

వేసవి తొంగిచూడ, తొలివేకువ వేళ రసాల పల్లవ
గ్రాసకషాయ కంఠమున గమ్మఁగఁబాడు పిక స్వరాని కెం
తేసరితూఁగు గీతములఁ దేవెదు నీ గమనమ్ము ప్రీతితో
కేసరి నాన్నగారు తిలకించె దరమ్మ! దివంబునుండియే! –

బాలికలున్ నవోఢలెలఁ బ్రాయపుటింతులు, వృద్ధులాత్మ గే
హాలకు ముందు నిల్చి, సుమహారతి స్వాగత మిత్తురమ్మ! నీ
వాలక మట్టె చూచి, కవిపండిత వర్యులు దీవెనమ్ములు
ద్వేల ముదాంతరంగులయి తేల్తురు భావ పరీమళమ్ముగన్

ఒజ్జలు చెప్పినట్టుల గృహార్చిముల్ సవరించి యెల్లరున్
మజ్జనమాడి, క్రొంజిలుగు మంగళవస్త్రములన్ ధరించి సం
పజ్జనకంబులైన మణిమండనముల్ క్తయి సేసి, వేఁపపూ
బజ్జిని నారగించెదరు బాంధవ పుత్ర సతీసమేతులై –

కోయిల పాటకుఁ గుల్కు బెళ్కులు కూర్చు రమణీయ నవ్యగీతముల సొంపు,
నెమిలి నృత్యమ్ముతో సమభంగిమముజూపు క్రమబద్ధమైన వర్తన విధమ్ము
పాలబుగ్గల చిన్న పాపల ముచ్చటఁ దేలించు బాలగేయాల మురువు
మహిళా సమాజ సన్మాన చారిత్రక కమనీయమగు నీతికథల సౌరు,

గలిగి "జయ" వత్సరాదిని కరసరోజ కంకణధ్వాని పద పద్మకనకరత్న
ఘటితమంజీర రవళితోఁ గలసియాడ వేగరావమ్మ! "గృహలక్ష్మి"
స్వాగతమ్ము!

# విండర్ మియర్ సతి, విసనకర్ర

రచయిత :
ఆస్కార్ వైల్డ్

అనువాదం :
సో. రామచంద్ర అగస్త్య ఎం. ఏ.

(ఫిబ్రవరి సంచిక తరువాయి)

విం. ప్ర:- ఈ విషయం రేపు మాట్లాడుకో కూడదూ ?

మి. ఎ:- ఊహుఁ. నేను రేపాయన్ని స్వీకరిస్తున్నాను. ఆ సమయంలో నాకేదో కొద్ది ఆస్తి ఉందని ఆయనతో చెప్పడం సబబుగా ఉంటుంది - అయినా ఏమని చెప్పను ? పినతాత మనవడో, రెండో భర్తో, లేకపోతే ఏ దూరపు బంధువో సంవత్సరానికి 2000 పౌనుల ఆస్తి నాకు విడిచి పెట్టినట్లు. ఆవిషయం కాస్త ఆకర్షణీయంగా నుండదూ? విండర్ మియర్ గారూ, నాకు సహాయపడేందుకు మీకిది చక్కని తరుణం, ఆ విధంగా నన్ను పొగడినవారౌతారుకూడా. పొగడడంలో మీరంతగా ఆరితేరినట్లుగా లేదే. మార్గరెట్ ఆ విషయంలో మిమ్మల్ని అంతగా ప్రోత్సహిస్తున్నట్లుగా నాకు తోచడంలేదు. అది ఆవిడచేసే పెద్ద పొరపాటు. పురుషులు చక్కగా మాట్లాడనినాడు, చక్కగా ఆలోచించలేరు. నిశ్చయంగా చెప్పండి, 2000 పౌనులు చాలా ? 2500 పౌనులైతే బాగుంటుందేమో. కాస్త ఎక్కువగా ఉండడమే ఈ కాలంలో మంచిది. ఈ లోకం బలే తమాషాగా ఉన్నట్లుగా నాకగుపిస్తుంది. మీ కెలాగ తోస్తుంది?

[విండర్ మియర్ ప్రభువుతో డాబామీదికి వెళ్లిపోతుంది. బాల్ రూమ్‌లో పాట ప్రారంభిస్తుంది.]

విం. స:- ఈ ఇంట్లో ఒక్క నిమిషంకూడా ఉండకూడదు. నన్ను ప్రేమించిన ఒక పురుషుడు ఈ రాత్రి తన జీవితాన్నే నాకర్పించేడు. నేను నిరాకరించేను. నిజంగా నేను తెలివితక్కువగానే ప్రవర్తించేను. నేను నా జీవితాన్ని అతని కర్పిస్తాను. అవును అతని కర్పిస్తాను. ఇదిగో వెడతాను! (పెద్దకోటు తొడుగుకుని, తలుపు దగ్గిరికివెళ్లి మళ్లా తిరిగివస్తుంది. బల్లదగ్గిరకివచ్చి, ఓ ఉత్తరంవ్రాసి, కవరులోపెట్టి, బల్లమీద ఉంచుతుంది) ఆర్థరుకి నాగుణం ఇంకా అర్థంకాలేదు. దీనిని చదివిన తర్వాత అర్థమవుతుంది. ఇకమీదట ఆయన ఇష్టంవచ్చినట్లుగా జీవితాన్ని గడపవచ్చు. నా జీవితాన్ని

సక్రమపద్ధతిలోనే, చక్కని మార్గం లోనే సాగిస్తున్నాను. ఆయనే వివాహ నిబంధనకి వ్యతిరేకంగా నడుచుకున్నారు, నేనేమీ వ్యతిరేకంగా నడుచుకోలేదు. దాస్యంనుండి విముక్తురాలౌతున్నాను. (వెళ్లిపోతుంది.)

[పార్కర్ 'ఎల్' ద్వారంగుండా ప్రవేశించి బాల్ రూమ్ ద్వారాన్ని సమీపిస్తూ ఉండగా మిసెస్ ఎర్లిన్ ప్రవేశిస్తుంది.]

మి.ఎ:—విండర్ మియర్ సతిగారు బాల్ రూమ్‌లో ఉన్నారా ?

పార్కర్:—అమ్మగారు ఇప్పుడే బయటికి వెళ్లేరు.

మి.ఎ:.బయటికి వెళ్లేరా ?, డాబామీద లేరూ ?

పా:—లేరు అమ్మగారూ! అమ్మగారు ఇప్పుడే బైటికి వెళ్లేరండి.

మి.ఎ:—(కంగారుతో, దిగ్భ్రమించిపోయినట్లుగా ఆ నౌఖరు ముఖంవైపు చూస్తుంది) బయటికి వెళ్లేరా ?

పా:—అవును, అమ్మగారూ – వెళ్లేటప్పుడు అయ్యగారికో ఉత్తరం బల్లమీదఉంచి వెళ్ళినట్లుగా చెప్పేరు.

మి.ఎ:—ఉత్తరం విండర్ మియర్ ప్రభువుగారికా ?

పా:—అవును, అమ్మగారూ.

మి.ఎ:—సరేలే.

(పార్కర్ వెళ్లిపోతాడు. బాల్‌రూమ్ లోని సంగీతం ఆగిపోతుంది.) బయటికి వెళ్ళిపోయిందా! భర్తకి ఒక ఉత్తరం రాసి మరీ వెళ్లిందీ! (బీరువావైపు వెళ్లి, ఉత్తరాన్ని చూస్తుంది. దానిని పైకితీసి వణుకుతున్న చేతుల్తో దానిని మళ్లా కింద పెట్టేస్తుంది) కాదు, కాదు! అది అసంభవము! అదే విషాదఘట్టం మళ్లా జీవితంలో సంభవించకూడదు! అయినా ఈ దారుణమైన ఊహ నాకెందుకు కలుగుతుంది ? నేను పూర్తిగా మర్చిపోదలచిన ఆ ఒక్క తరుణమూ నేను మళ్లా ఎందుకు జ్ఞప్తికి తెచ్చుకోవాలి ? జీవితంలో అదే విషాదఘట్టం మళ్ళీ సంభవమా? (ఉత్తరం చించి చదువుతుంది, వెలవెలపోతున్న ముఖంతో కుర్చీలో కూలబడుతుంది) అబ్బా, దుర్భరం! ఇరవై ఏళ్లకు ముందు వాళ్లనాన్నకు నేను రాసిన వాక్యాలే ఇవి! వాటివల్ల ఎంత బాధకి నేను గురి అయ్యేను! కాదు, నాబాధ, నానిజమైన బాధ, ఇవేళ రాత్రే ఇప్పుడే ప్రారంభిస్తున్నది! (బల్లదగ్గిర కూర్చునే ఉంటుంది.)

[విండర్ మియర్ ప్రభువు డాబానుండి ఎల్. యు ద్వారంగుండా ప్రవేశిస్తాడు.

విం.ప్ర:-నా భార్య దగ్గిర సెలవు తీసుకున్నారా ? ('సి' తలుపు దగ్గిరకి వస్తాడు)

మి.ఎ:-(ఉత్తరాన్ని నలిపేసి చేతిలో దాస్తూ) అవును.

విం.ప్ర:-ఆవిడ ఎక్కడుంది ?

మి.ఎ: ఆవిడ చాలా అలిసిపోయింది. ఆవిడ పడుకుంది. తల నొప్పిగా ఉందని చెప్పింది.

విం.ప్ర:-నేను ఆ విడ దగ్గిరికి వెళ్లాలి. నన్ను క్షమించండి.

మి.ఎ:-(కంగారుగా లేస్తూ) అబ్బే ఏమీ లేదు, ఏమీ ఫర్వాలేదు. ఆ విడ చాలా అలిసిపోయింది, అంతే. అదీగాక ఇంకా చాలామంది భోజనం చేస్తూ ఉన్నారు. వాళ్లని తను అక్కడ లేనందుకు క్షమాపణ మిమ్మల్ని వేడుకోమన్నది. బాధగా ఉన్నందువల్ల తను కదలలేనన్నది. (ఉత్తరం కింద పడుతుంది) మీకు చెప్పమన్నది !

విం.ప్ర:-(ఉత్తరాన్ని తీస్తాడు) మీరేదో పారేసినట్లున్నారు.

మి.ఎ:-అవును, ధన్యవాదాలు, అది నాదే (ఉత్తరాన్ని అందుకోడానికి చెయ్యి చాచుతుంది)

విం.ప్ర:-ఇంకా (ఉత్తరాన్నిచూస్తూ) అదీ నాభార్య చేతిరాతలాగున్నదే, కాదూ?

మి.ఎ: (ఉత్తరాన్ని గబుక్కున తీసుకుని) అవును. అది — ఎడ్రసు. నా బండిని రప్పించమని మీ వాళ్లతో కాస్త చెబుతారా.

వి.ప్ర:-తప్పకుండా ('ఎల్' ద్వారంగుండా వెళ్లిపోతాడు.)

మి.ఎ:-అబ్బా, బ్రతికేను ! ఇప్పుడేమి చేసేది ? ఎప్పుడూలేనికరుణ ఇప్పుడు నా హృదయాన్ని ప్రవేశించింది. దీని అర్థమేమిటి ? కూతురూ తల్లిలాగే ప్రవర్తించకూడదు-అది చాలా భయంకరమైన పరిస్థితికి దారి తీస్తుంది. నేను ఆవిణ్ణి రక్షించడం ఎలాగ? నాఅనుంగు కూతుర్ని ఎలాగ రక్షించగలను ? ఒక క్షణంలో జీవితం సర్వనాశనంకావచ్చు. అది నాకు సువిదితమే ! విండర్ మియర్ ని ఈ ఇంటినుండి ఎలాగైనా బయటికి పంపించాలి; అది అవశ్యకర్తవ్యం. (ఎల్ ద్వారం దగ్గరకివెళ్లి) అది ఎలాగ చెయ్యడం ! ఎలాగో ఓలాగ చేసి తీరాలి. ఆహా !

[అగస్టస్ ప్రభువు బొక్కాతో ఆర్. యూ ద్వారంగుండా ప్రవేశిస్తాడు.]

అగస్టస్ ప్రభువు:-ప్రేయసీ, చెప్పరాని మనోవ్యథలో ఉన్నాను. నేను అడిగినదానికి సమాధానమిద్దూ ?

మి.ఎ:-అలాగైతే వినండి. విండర్ మియర్ ప్రభువుని వెంటబెట్టుకుని మీ క్లబ్బుకి వెళ్ళండి ; ఆయన్ని అక్కడ ఎంత వరకూ వీలౌతుందో అంతవరకూ ఉంచండి. తెలిసిందా ?

(సశేషము)

# వేసంగి పానీయము

మండు వేసంగి కాలములో వృద్ధులు, బాటసారులు, బాలబాలికలు ఆరోగ్య సదుపాయములు పాటించవలయును. అందులకు సహకారిగనుండు పానీయములు కలవు. దానిలో సులభమయిన నొక దానిని యిందు పొందుపరుపదలచినాను.

| | | |
|---|---|---|
| ఖర్జూరపుకాయలు | 5 | ప |
| వట్టివేరు | 5 | ప |
| సుగంధిపాలు | 5 | ప |
| ఏలకులు (మంచివి) | ½ | ప |
| మిరియాలు | 1 | తు |

మొదట ఖర్జూరపుకాయలను బాగుగ చిదుకకొట్టి గింజలు తీసి జాగ్రత్తచేసుకొనవలయును.

వట్టివేరు, సుగంధిపాల వలుపునుకూడ అటులనే చిదుగకొట్టి చూర్ణముగనుంచుకొనవలయును.

ఏలకులు మిరియాలును ఏకముగపొడి చేయవలయును.

ఇట్లు చూర్ణముగనున్న దానిని ఉదయము మొదలు సాయంత్రము వరకు నిల్వవుంచుకున్న త్రాగునీటిలో సన్నని తెల్లని గుడ్డలో సుమారు 5 తులములను వుంచి ముడివేసి నీళ్లలో విడువవలయును.

దాహశాంతికిగాని, పానీయరూపముగగాని త్రాగవచ్చును.

కోట వేంకటరంగయ్య




**భక్త లీలామృతము: శ్రీభక్త నరసింహంగారి పుత్రులు సత్యనారాయణ. ప్రచురణకర్తలు: టి. వెంకటరత్నం, కీరపండరీక్షేత్రం, చిలకలపూడి పోష్టు, కృష్ణాజిల్లా. వెల రు 10–0–0**

భగవంతుని అవతారములలో నొకటైన పాండురంగని మహాత్మ్యము యీ గ్రంధము నందలి విషయము. ఇందులో పండరీపురక్షేత్రమునకు సంబంధించిన విషయములు, జయదేవాది భక్తుల జీవిత విశేషాలు, వానికి సంబంధించినకధలు, భగవంతుని విలాసములు చక్కని మృధుమధుర శైలిలో రచింపబడినవి.

ఈ గ్రంధము షుమారు 800 పుటలుగలది. ఇందులోని చిత్రములు యిందలి భాగవత విశేషములకు వన్నె తెచ్చుచు పాఠకులకు భక్తివిశేషములను ప్రబోధించునవిగానున్నవి.

**మాలికా రామాయణము: షట్కవీప్రణీతం. కౌముదీప్రచురణము, విజయనగరము. ప్రతులకు ఉప్మాక నారాయణమూర్తిగారు బి. ఏ., వకీలు, పార్వతీపురం, శ్రీకాకుళం జిల్లా. వెల రు 2–0–0**

ఇది రామాయణమును వస్తువుగా గ్రహించి పద్యరూపముగా రచింపబడిన గ్రంధము. ఆరుగురు పండితకవులు ఆరుకాండములను రచించినారు. వీరు సుప్రసిద్ధులగుటచే కవితానైపుణ్యముసయితము కడుసమర్ధముగాను, దుష్కరనియమములతో, ప్రాచీనభాషలోనిద్దుష్టముగను, రసవంతముగానున్నది. ఇట్టి ఉత్తమ గ్రంధాలు సారస్వత అభివృద్ధికి ఎంతైనా తోడ్పడగలవు.

**సంఖ్యా శాస్త్రము: శ్రీ దామరాజు శివరామయ్య. ప్రచురణకర్తలు: వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ పి. బి. నెం 1372, మద్రాసు 1. వెల రు 2–0–0**

ఇది జ్యోతిషగ్రంధము. గ్రహచలనము ననుసరించి ఒకటి మొదలు తొమ్మిదివరకు గల సంఖ్యలనుబట్టి జీవితమునందలి భూతభవిష్యద్వర్తమానములను తెలిసికొనుటకు విధానము యీ గ్రంధములో వివరించబడినది. ఈ గ్రంధపఠనంవలన దైనిక జీవితంలోని అనేక విషయాలను తెలిసికొని భవిష్యత్ నిర్ణయానికి, వర్తమానంలో జాగ్రతపడడానికి అవకాశములు అనేకం. ఈ గ్రంధసహాయంతో దిన, వార, మాస సంవత్సర ఫలితాలను, భవిష్యత్తునందలి జీవితవిశేషాలను సులభముగా తెలిసికొనవచ్చును.

**సంగ్రహరాఘవేశ్వరశతకము : శ్రీ కంభలూరు నరసింహశర్మ, యాడికి, అనంతపురంజిల్లా. వెల 0–5–0**

రామనామ సంస్మరణ 'రక్తిముక్తి దాయకం' అన్నట్లు ఈ శతకరచన భక్తి ప్రబోధంతో బాటు ప్రజలనైతిక జీవిత ప్రమాణాన్ని పెంచడానికని ఉద్దేశించబడింది. గ్రంధకర్త స్వయంగా 'సంఘంలోనైతిక పతనావస్థగా నెంచిన' అనుభవాలను దృష్టియందుంచుకొని తోడిమానవుల శ్రేయోభివృద్ధుల నుద్దేశించి యీ కృతిని రచించిరట. ఒడిదుడుకులులేని కవిత్వధోరణి, సరళమైన భాష పేర్కొన తగినవి. ఇట్టి అభ్యుదయ కవికుమారులు ప్రోత్సాహనీయులు.

# సంపాదకీయములు

## ప్రపంచ ఆరోగ్యదినం

ప్రపంచ ఆరోగ్య దినోత్సవ సందర్భమున రేడియోలో ప్రసంగించుచు ఆరోగ్యశాఖామంత్రిణీ రాజకుమారి అమృత్ కౌర్ గారు మన దేశమందు వైద్యవసతులపట్ల ప్రపంచ ఆరోగ్యసంస్థ చూపుచున్న ఆసక్తికి కృతజ్ఞతను వెల్లడించారు. మిత్రరాజ్యసమితితలపెట్టిన సత్కార్యాలలో ఈ ప్రపంచ ఆరోగ్యసంస్థద్వారా పెంపొందించిన అంతర్జాతీయ సుహృద్భావము ప్రత్యేకముగా పేర్కొనతగినదనికూడ చెప్పిరి.

ఇదే సందర్భమున జ్యోతిర్మయి, ఫ్లారెన్స్ నైటింగేలులను ఆదర్శంగా నుంచుకొని సేవాపరాయణతను, త్యాగనిరతికి పేరందిన భారత స్త్రీలు ముందంజవేసి నర్సులుగాచేరి పురోగమించాలన్నారు.

ఉన్నత విద్యాభ్యాసానికి ఆర్థికవసతులులేని యువతులందరికి నర్సులుగా శిక్షణ యివ్వడానికిగాను ఒక ప్రత్యేకశిక్షణనిధి ఏర్పాటుచేయాలని ఉద్బోధించుచు, వ్యాధిపీడితులకు సేవచేయడంలో నర్సులుచూపే ఆసక్తిని, ఓర్పును ప్రశంసించి రోగులకు విశ్రాంతి సమయాలలో ఏవిధమైన భయాందోళనలు లేకుండా ఆరోగ్యప్రదమైన వాతావరణము, వసతులు ఏర్పాటు చేయాలన్నారు.

భారతదేశము స్వతంత్రమయిన తరువాత యువతులు మునుపటికంటె అధిక సంఖ్యాకులుగా నర్సుల శిక్షణ పొంద నుత్సహించుచున్నారు. నిస్సహాయులు, వికలాంగులు వ్యాధిగ్రస్తులుగా బాధపడుచున్న వారికి సేవచేయడం ఉత్తమోత్తమ మయిన విషయము. అందుకు ప్రత్యేకముగా కావలసిన ఓర్పు, సహనము, దయలాంటివి స్త్రీలోనే మూర్తీభవించియున్నవి. అట్టిమానవసేవా ధర్మాన్ని నిర్వహించడం పరమ పవిత్రంగానెంచి అవకాశమున్న వారెల్ల నర్సింగ్ శిక్షణపొందాలి. వ్యాధినివారణకు, నిర్మూలనకు కూడ నర్సులు చేయగలసేవ విశేషముగాకలదు.

హైదరాబాద్ ప్రధాని శ్రీ బూర్గుల రామకృష్ణ రావుగారు మరొక అడుగు ముందుకువేసారు. ఉన్నత విద్యాలయాలలో విద్యార్థినులకు నర్సింగ్ కోర్సును ప్రవేశపెట్టడానికి గల అవకాశములను విద్యాశాఖవారిచే పరిశీలింప జేస్తున్నారు. ఈ విషయాన్ని ప్రపంచ ఆరోగ్య దినోత్సవసందర్భమున నర్సులు, మంత్రసానుల సమావేశంలో 'వెల్లడిస్తూ నర్సింగ్ శిక్షణను నిర్బంధం చెయ్యాలని తాముకోరుతున్నట్లును, దానిమూలంగా నర్సుల కొరత తగ్గడమే కాక విద్యార్థినులు అనంతరం తగిన తల్లులు కావడానికి వీలున్నద' న్నారు.

శ్రీమతి అమృతకౌర్ చెప్పినట్లు శిక్షణ సౌకర్యాల నేర్పరచుటకు ప్రత్యేకనిధి యవసరమయినది. ప్రజలు దాని యొక్క ప్రాధాన్యతను గుర్తించి విరివిగా సహాయపడి నర్సింగ్ శిక్షణవలన సమకూరే సుహోపకారమునకు దోహదమివ్వగలరని మావిజ్ఞప్తి



# శ్రీ జయనామ సం॥ర చైత్ర-వైశాఖమాసములు

1954 సం॥ ఏప్రిలు నెల

| | | |
|---|---|---|
| 16 | శు | త్ర 1.9 ఉఫ 9-2 రా 1.29 త్యా 4.23 |
| 17 | శ | చతు 5.28 హ 15.7 రా 6 12 |
| 18 | ఆ | ○ పౌ 10.7 చి 21.6 వజ్ర 60-10 రా 5.28 వసంతోత్సవః |
| 19 | సో | బహుళపాడ్యమి 14.40 స్వా 27-6 రా 11.26 |
| 20 | మం | విది 19.0 విశా 32.49 రా 12 39 తృతీయాతిథిః తిరువల్లిక్కేణి పార్థసారథి [స్వామివారిగరుడోత్సవం |
| 21 | బు | తదియ 22 50 అనూ 38.0 రా 21.57 శూన్యతిథిః |
| 22 | గు | చ 25.53 జ్యే 42.22 త్యాజ్యాభావః |
| 23 | శు | పం 28 0 మూ 45.47 దివ 3.23 మధ్వజయంతి |
| 24 | శ | ష 28.57 పూషా 48.3 ది 10.35 |
| 25 | ఆ | స 28-38 ఉషా 49.7 దివ 8.17 భానుసప్తమి |
| 26 | సో | అ 27.9 శ్ర 48.55 రా 27.28 అమృతసిద్ధియోగం |
| 27 | మం | న 24.23 ధని 47.30 శేష 2.27 |
| 28 | బు | ద 20.31 శత 45.2 దివ 4.17 తిథిద్వయం |
| 29 | గు | ఏ 15 40 పూ 41.40 దివ 0.2 జీవానారైకాదశి |
| 30 | శు | ద్వా 10.4 ఉభా 37.38 ది 3.57 వరాహజయంతి |
| 1 | శ | త్ర 3.53 ఏవ్యం 53.30 దివ 5.19 |
| 2 | ఆ | ● అమా 50 42 అశ్వ 28-32 దివ 19.17 |

## వైశాఖమాసం

1954 సం॥ మే నెల

| | | |
|---|---|---|
| 3 | సో | శుద్ధపాడ్యమి 44.28 భ 24.9 రా 20 46 వైశాఖస్నానం |
| 4 | మం | విదియ 38.41 కృ 20-6 రా 27-9 చంద్రోదయం |
| 5 | బు | తదియ 33.38 రో 16.43 దివ 30.14 |
| 6 | గు | చ 28-49 మృ 14.11 రా 3-13 త్యా 3.55 |
| 7 | శు | పం 26.30 ఆర్ద్రా 12 53 రా 11.57 కర్త్తరి ప్రవేశం |
| 8 | శ | ష 24.40 పున 13.25 రా 12 శు |
| 9 | ఆ | స 24.4 పుష్య 13 20 రా 14 57 సప్తమితిథిః |
| 10 | సో | అ 24.42 ఆశ్రే 15.28 రా 15.32 అష్టమితిథిః |
| 11 | మం | న 26-29 మ 18.42 రా 8.30 |
| 12 | బు | ద 29.14 పూఫ 22-59 రా 10.50 |
| 13 | గు | ఏ 32.51 ఉఫ 28.1 రా 19.21 త్యా 4.23 |
| 14 | శు | ద్వా 37-2 హ 33.40 రా 24.0 పరశురామద్వాదశి |
| 15 | శ | త్ర 41.33 చి 39.40 రా 23.21 శనిత్రయోదశి |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Founder-Editor : Dr. K. N. Kesari; Ag. Editor : C. C. Punniah.

# మనుజునకు రక్తమే జీవనము

రక్తమే ప్రాణాధారము. ఈ రక్తము దేహమంతయు నాడుల మార్గమున పారి శరీరపటుత్వమును కలిగించుచున్నది. రక్తము మనము భుజించు ఆహారము నుండి పుట్టుచున్నది. కొందరు తమ శరీరదార్ఢ్యమును కాపాడుకొను మార్గములను మఱచి వ్యాధుల పాలగుచున్నారు. ఇక్కాలపు విద్యావ్యాసంగము ఉద్యోగ ధర్మములు చాలవరకు మనుజులను అనారోగ్యులుగ జేయుచున్నవి. మఱియు విశేష సంచారము, అకాల భోజనము, మితిమీరిన భోజనము, మనోవ్యాకులము, మొదలగు వాటిచేత మనుజునకు జఠరాగ్ని మందగించి ఆహారమందు యిచ్ఛలేక వ్యాధిగ్రస్తుడగుచున్నాడు. ఈ కారణమువలన కొంతకాలమునకు శరీరమునందు నిరాటంకముగా ప్రవహించెడు రక్తమునకు ఆటంకము గలిగి అశక్తుడై, రక్తముచెడి అజీర్ణము ముఖ్యముగా సంభవించుచున్నది. ఈ అజీర్ణవ్యాధిని ఆధారపఱచుకొని గుల్మము, కడుపుబ్బరము, మలబద్ధము, భేదులు, వాంతి, అరుచి, పాండు, కామిల మొదలగు వ్యాధులు కలుగుచున్నవి — మందబుద్ధి, ధాతుక్షీణము కూడ కలుగుచున్నవి. అపరిశుద్ధ రక్తమువలన శోభ, తీట, మేహపొడ, తామర, మేహవ్రణములు మొదలగు చర్మవ్యాధులు కలుగుచున్నవి.

ధాతుక్షీణము, అశుద్ధరక్తము, రక్తమునకు ఆటంకము కలిగించి పక్షవాతము, సంధివాతము, మొదలగు వాతరోగములు సంభవించుచున్నవి. శ్వాసకోశములు, హృదయము, పిత్తకోశముచెడి, కాసక్షయాదులు, హృద్రోగము, ఉన్మాదము, మూర్ఛ, మొదలగు వ్యాధులు సంభవించును.

సమస్తవ్యాధులకు మూల కారణమగు అపరిశుద్ధ రక్తమును శుద్ధపరచి మనుజుని ఆరోగ్యమును కాపాడుటకు మా 'అమృత' శ్రేష్ఠమయినదని వాడినవారు చెప్పుచున్నారు.

'అమృత' పైవ్యాధులను కుదుర్చుటయేగాక నిలుకడగనుండు తలనొప్పి, కడుపులోమంట, అరచేతులు, అరికాళ్లు, కండ్లమంటలు, నిస్త్రాణ, నిద్రలేమి, వీటిని నివర్తించును.

'అమృత' లో మూత్రసంబంధమైన జబ్బులను కుదుర్చు ఓషధులు కలిసియుండుటచే మూత్రపు అడ్డు తొలగి ప్రమేహ రోగములును కుదురును. విషములను విరుచుమూలికలు చేరియున్నవి గనుక, విషక్రిమి కాటులవల్లను, రసగంధక, పాషాణాది విషద్రవ్య దోషములవల్లను చెడినరక్తమును శుద్ధియగును.

'అమృత' వలన స్వప్నస్ఖలనము, శుక్లస్రావము మందబుద్ధి, సుఖ సంకటములు, కీళ్లనొప్పులు మొదలగు జబ్బులు కుదురుచున్నవి. మంచిబలము, రక్తవృద్ధి, ఆరోగ్యము, ఇంద్రియపుష్టి, వాక్చాతుర్యము, దీర్ఘాలోచనశక్తి కలుగుచున్నవి.

'అమృత' సారవంతములగు మూలికలతోను, రసవంతములగు ఫలములతోను మకరందపూరితములగు పుష్పజాతులతోను తయారుచేయబడిన ద్రావకము. ఇది బాల్య, యౌవన, కౌమార, వార్ధక్యదశలయందు ఎల్లరు సేవించుటకు దగినట్లు తయారు చేయబడినది.

'అమృత' యను నామమునకు తగినట్లు రుచికరముగను యింపైన సువాసనతో నిండియుండునట్లుగను తయారు చేయబడినది.

12 ఔ॥ బుడ్డి రు. 4–4–0

6 ఔ॥ బుడ్డి రు. 2–4–0

## కేసరి కుటీరం లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14

తెలుగుజిల్లాలకు, నైజామునకు ఏజంట్లు :

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ – సికిందరాబాదు

భారత ప్రశస్తి

THE PRIDE of INDIA

Lodhra
UTERINE TONIC
KESARI KUTEERAM LTD. MADRAS

# LODHRA

FOR LADIES' HEALTH

KESARI KUTEERAM LTD., MADRAS

EASTERNS.394

లోధ్ర

స్త్రీల ఆరోగ్య భాగ్యానికి



Lodhra Press, Madras- 14.